TANJORE SARASWATHI MAHAL SERIES No. 71.

# HEMABJANAYIKA SVAYAMVARAMU.




BY

MANNARUDEVA

# HEMABJANAYIKA SVAYAMVARAMU

(YAKSHAGANA)

BY

## MANNARUDEVA

*Son of*

VIJAYARAGHAVA NAYAKA

*King of Tanjore 1633 - 73. A. D.*

EDITED WITH AN INTRODUCTION

BY

**Sri V. SUNDARA SARMA,**

*Pandit, Saraswathi Mahal Library, Tanjore.*

Published By

Sri S. GOPALAN, B.A., B.L.,

Honorary Secretary for the Administrative Committee,

T. M. S. S. M. LIBRARY, TANJORE.

1956.

**Price Rs. 1—8—0**

# హేమాబ్జనాయికాస్వయంవరము

(యక్షగానము)

మన్నారుదేవవిరచితము

పరిష్కర్త :
శ్రీ విరలదేవుని సుందరశర్మ,
పండితుఁడు, సరస్వతీమహాల్ గ్రంథాలయము,
తంజావూరు.

తంజావూరు సరస్వతీమహాల్
గ్రంథాలయ నిర్వాహక సంఘమునకై
గౌరవకార్యదర్శి యగు
శ్రీయుత S. గోపాలన్ B.A., B.L., గారిచే
ప్రచురింపఁబడినది.

**1956**

[మూల్యము రూ. 1-8-0

# PREFACE

This publication is a Yakshagāna or Opera in Telugu by Mannārudēva, the last prince of the Tanjore Nāyak line, who did not live to rule after his father but died with his father in the battle (A. D. 1673) which ended the Nāyak line.

Yakshagāna is a dramatic composition in songs interspersed with short prose narratives intended for being sung and recited by a pair of street-singers. Yakshas are celestial minstrels and hence the name Yakshagāna is given to such compositions. We have no Yakshagānas in Sanskrit. This type of composition appears to have been begun by poets and composers in Telugu language during the days of the Nāyaks of Vijayanagar and carried by them to Tanjore and other southern districts. Yakshagānas in Tamil appear to have followed those in Telugu and they go by the name of "Charitra Keertanai". The famous Nandanār Charitra Keertanai by Gōpāla Krishna Bhārati is a Yakshagāna.

The present work is called "Hemabjanāyikā Swayamvaramu", and the theme is that of "Lakshmīswayavaram", the wellknown episode detailed in almost every purana, namely, the choice of Mahāvishnu as her Lord by Lakshmi who rose out of the Milk-ocean when it was churned by the Dēvas and Asuras for obtaining nectar.

The story begins with the request of Devas to Lord Vishnu to help them in churning the ocean of milk for nectar. The other incidents follow as in the puranic story. The plot however is enlarged by including the pangs of separation of Mahalakshmi and Mahavishnu after their love at first sight and their eager expectation that the choice and acceptance should come off as desired. Messengers are sent and each is appraised of the pangs of the other. The author has in his version of the story bestowed on his own father Vijayaraghava Nayaka, the office of the messenger of their Patron Deity to Samudra Raja, the father of Mahālakshmi to negotiate the alliance. The credit for the success of the mission is also assigned to him. The piece ends with the celebration of the marriage.

The diction of the work is highly elegant and both the songs and pieces of prose are of a high class in diction and import.

This work is probably the last literary effort of the Nāyak period in Tanjore; for, with the author, the line of the Nayak Rajas of Tanjore ended. The tragic heroism of Mannārudēva who counselled death with honour in a battle whose conclusion was foregone and himself faced the enemies' army, marks him out as one among the memorable heroes in history. The last incidents of his life which ended with his entry into the battle makes his tragic end more pathetic. In a fit of anger his father had cast him into prison for some reason which history has yet to find out with certainty. Tradition has it that he was believed to have made love to his preceptor's daughter. But this is made improbable by the words addressed by him to his father in the form of a stanza when he was released to help his father in the battle.

The Stanza is to the following effect:—

The Sea which casts jewels beneath (and)
straws uppermost - See!. That is its defect:
(But) a jewel is a jewel, a straw is a straw.
Oh! Vijaya Raghava! Lord and Conqueror in combat.

(Pp. - 195 - Oriental Historical manuscripts by William Taylor vol. II).

These words point to some political reason rather than a private reason as tradition would have it. With all the undeserved treatment meted out to him by his father, he has shown uniform affection and regard to him as is evident even from this stanza.

Such a prince with such gifts and such a character will ever be a memorable figure both among Telugu scholars and historians.

The editor of this work, Sri V. Sundara Sarma, our Telugu Pandit who has to his credit the editing of a number of works in Telugu already, has spared no pains in editing this work with a useful introduction. Our thanks are due to him for his valuable services.

Our thanks are due to the Government of Madras for their liberal grants which have enabled us to publish this and other rare and valuable manuscripts in this library.

Tanjore,
Date: 26-7-'56.

S. GOPALAN,
*Honorary Secretary,*
Sarasvati Mahal Library Committee.

# ఉపోద్ఘాతము

ఈ హేమాబ్జనాయికాస్వయంవరము తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయమునుండి వెలువడు ఆంధ్రగ్రంథములలో నొకటి. ఆంధ్రసారస్వతజగత్తులో సగ్రగణ్యమైన స్థానము నాక్రమించి మించిన దీ తంజావూరు. 16, 17-వ శతాబ్దములు రెండును నాంధ్రుల చరిత్రలో ప్రముఖస్థానము నాక్రమించినవి. సర్వతోముఖముగ నభివృద్ధిఁజెందిన ఆంధ్రవాఙ్మయము నాంధ్రాభ్యుదయమును దశదిగంతములకుఁ జాటిన కాల మది. రాజులు, మంత్రులు, గాయకులు, పండితులు, కవులు, కవయిత్రులు వారు వీరనక యెల్లవారును నేకోన్ముఖముగ నాంధ్రాభ్యున్నతికై పాటుపడి "సెబాస్ తంజావూరు" అనిపించుకొన్న మఱపు రాని మధురాతిమధురమైన కాల మది. ప్రబంధములు, ద్విపద కావ్యములు, పదములు, యక్షగానములు మొదలగు నానావిధకావ్య నిర్మాణచాతుర్యములో ననవరతసారస్వతవ్యాసంగములతో విస్మయావహ మగు విఖ్యాతి నార్జించుకొన్న నాయకరాజుల యశోవైభవములు వేనోళ్లఁ బొగడఁదగినవి. వారి సారస్వతాభిమానమునకును సారస్వత తృష్ణకును మేరయే లేదు. బహుముఖ మగు నాటి సారస్వతవాహిని చోళసామ్రాజ్యమునే తన సుధారసాతిశాయితరంగసందోహములతో ముంచెత్తినది. ముఖ్యముగ రఘునాథనాయకుని కాలము (1614-1633) నతని కుమారుఁడగు విజయరాఘవనాయకుని కాలము (1633-1673) ను పేర్కొనఁదగియున్నవి.

## రఘునాథనాయకుఁడు :

ఇతఁడు విద్వత్కవి, సరసుఁడు, మధురతమకావ్యనిర్మాతయుఁ బోషకుఁడునునై విఖ్యాతిఁగన్న వాఁడు. ఇతని కాలములో తంజాపుర పరిస్థితి చాల సంకటముగ నున్నట్లును, రఘునాథుఁడు తన ధైర్యశౌర్య

సాహసములతో తంజావూరును శత్రుభయరహితముగఁ జేసె ననియుఁ జరిత్రము చాటుచున్నది. పండితుఁడు, కవియు నగు గోవిందదీక్షితుఁ డీతని ప్రధానిగ నుండెను.

రఘునాథునికృతులు :

సంగీతసాహిత్యములలో నప్రతిమానప్రతిభను గలిగిన రఘునాథుఁ డనేకగ్రంథముల నిర్మించి విఖ్యాతుఁ డయ్యెను. "అచ్యుతనాయకాభ్యుదయ" మను ద్విపదకావ్యమును రచించి నాయకాభ్యుదయరచనలకు మార్గదర్శకుఁ డయ్యెను. [1]నలచరిత్ర, [2]రామాయణము, [3]వాల్మీకిచరిత్రము మొదలగు కృతు లీతనికృతులలో ముఖ్యములైనవి. ఇతని కృతులు కొన్ని లభ్యములు కాకపోవుట మన దురదృష్టమే. ఇతని పారిజాతాపహరణము, గజేంద్రమోక్షము, రుక్మిణీకృష్ణ వివాహము, జానకీపరిణయము మొదలగునవి దొరకని కృతులు. ఇదియుగాక అనేక సంస్కృతాంధ్రగ్రంథములకుఁ గృతిభర్తయై కవిపండితులఁ బోషించిన రసికుఁడు.

రఘునాథనాయకుని యాస్థానకవులు :

చేమకూర వెంకటకవి, కృష్ణాధ్వరి మొదలగువా రీతని యాస్థానమండలి యుద్దండకవిశిఖామణులు. చేమకూర వెంకటకవి "విజయవిలాస" మను రసవత్తర మగు ప్రబంధమును రచించి రఘునాథభూపాలుని కంకితముగావించెను. పై గ్రంథము టీకతోడ ముద్రితమైయున్నది. కృష్ణాధ్వరి నైషధపారిజాతీయ మను శ్లేషకావ్యమును విరచించి యద్దానికి రఘునాథనృపాలుని గృతిభర్తగా నొనరించెను. ఇయ్య దీ తంజావూరు

---

1. 2. 3. ఈ మూఁడు గ్రంథములు ముద్రితములు – రామాయణము, వాల్మీకిచరిత్ర, ఈ రెండును ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే ప్రచురింపఁబడినవి,

సరస్వతీమహాల్ భాండాగారమున నున్నది. ఇంకను ముద్రింపఁబడలేదు. మఱియు రామభద్రాంబ మధురవాణి మొదలగు కవయిత్రులుగూడ నీతని యాస్థానము నలంకరించిరి. రామభద్రాంబ "రఘునాథాభ్యుదయ"మను సంస్కృతగ్రంథమును రచించి ప్రసిద్ధిఁగాంచినది. ఇట్లనేక సంస్కృతాంధ్రకవిపండితబృందపోషకుఁడై రఘునాథుఁడు సాహితీభోజుఁడని విఖ్యాతుఁ డయ్యెను.

విజయరాఘవనాయకుఁడు :

సరససంగీతసాహిత్యకళావిదగ్ధుఁ డగు రఘునాథనాయకుని తర్వాత విజయరాఘవనాయకుఁడు దక్షిణాంధ్రరాజ్యసింహాసన మధిష్ఠించెను. ఇతఁడు 1633-1673 వఱకు తంజాపురమును నిరర్గళముగఁ బాలించెను. ఇతని రాజ్యపాలనాకాలమునఁ దంజాపురము శత్రుభయములేక సమరభీతియు లేకయుండినది. ఆకాలమును సరససాహిత్యగోష్ఠులలో సద్వినియోగపరచుచు వచ్చిన దీతని యాస్థానము, కుమారతాతయాచార్యులు, నతనికి పిదప నతనిపుత్రుఁ డగు శ్రీనివాసతాతయాచార్యులును సభామంటప మలంకరించి యుండిరి. తన తండ్రివలె విజయరాఘవనాయకుఁడు కూడ ననేక కృతులకు భర్త, వివిధకృతుల నిర్మాత. ఇతఁడు యక్షగానములు ద్విపదలు చౌపదలు మొదలగు వివిధరచనల సాగించిన మేటి. తన తండ్రి యగు రఘునాథనాయకుని చరిత్రను వర్ణింపుచు రఘునాథనాయకాభ్యుదయము (ద్విపదకావ్యము) రఘునాథాభ్యుదయము (యక్షగానము) అను రెండు గ్రంథములను రచించెను. ఇదిగాక విజయరాఘవనాయకుఁడు పెక్కు గ్రంథములను విరచించియున్నాఁడు. అతనికృతి యగు "[1]ప్రహ్లాదచరిత్ర" మను యక్షగానములోని సీసమాలికలో నతని కృతులు వివరింపఁబడి యున్నవి. అద్దాని బరిశీలించినచో నీతనిలేఖిని యెంతటి మనోహర మగు కావ్యముల నెంత నిరర్గళము సృష్టించినదో స్పష్టము కాఁగలదు. ఇతని కృతులలో నీ క్రిందివి సమీపకాలమున ముద్రితములైనవి.

---

1. తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమున నున్నది. D. 541; M. 692.

1. రఘునాథనాయకాభ్యుదయము (ద్విపదకావ్యము)
2. రఘునాథాభ్యుదయము (యక్షగానము)
3. విప్రనారాయణచరిత్ర ( ,, )
4. శ్రీకృష్ణవిలాసము ( ,, )

ఇంకను జాల గ్రంథములు ముద్రింపఁబడవలసియున్నవి. చాల గ్రంథములు దొరకుట లేదు. ఇతని దొరకని గ్రంథములలో పారిజాతాపహరణము, పాదుకాసహస్రము, (శ్రీమద్వేదాంతదేశికుల పాదుకాసహస్రమునకు తెనుఁగు సేత) ఇత్యాది చాల ముఖ్యము లగు నపూర్వ గ్రంథములు గలవు. "రాజగోపాలవిలాసం" బను ఇతని సభామంటప ముద్దండు లగు కవిప్రకాండులతో నిండి ప్రకాశించుచుండినది. "సాహిత్యరాయపెండేర" మను బిరుదంబును గలిగిన నాయకరాజ శిఖామణి యగు విజయరాఘవుని పార్శ్వస్థాన విరాజిల్లు శారదాధ్వజ మీతని సాహితీనైపుణ్యమును వైదుష్యము నతులితకవితాచాతుర్య ధుర్యత్వమును విశృంఖలితకళాభిమానిత్వమును నమితకళావైదగ్ధ్యమును దిగంతములకుఁ జాటుచుండినది.

విజయరాఘవనాయకుని యాస్థానకవులు :

విజయరాఘవనాయకుని యాస్థానమునఁ గవితానైపుణ్యమునఁ బేరుగాంచిన యుద్దండు లగు కవు లుండిరి. చెంగల్వ కాళకవి, కోనేటి దీక్షితచంద్రుఁడు, పురుషోత్తమదీక్షితుఁడు, కామరసు వెంకటపతి సోమయాజి, రంగాజమ్మ మొదలగువారు ముఖ్యులు.

---

1. 2. తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమువారిచేఁ బ్రచురింపఁబడినది. సంపాదకులు—శ్రీ వేలటూరి వెంకటరమణయ్యగారు, శ్రీ పట్టంపల్లి సోమశేఖర శర్మగారు.

3. తంజావూరు సరస్వతీమహాల్ వారిచేఁ బ్రచురింపఁబడినది. సంపాదకులు — శ్రీ వి. సుందరశర్మ, శ్రీ అ. మహాదేవశాస్త్రి.

4. తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమువారిచేఁ జర్నలులోఁ బ్రచురింపఁబడినది. సంపాదకుఁడు — శ్రీ విఠలదేవుని సుందరశర్మ.

చెంగల్వ కాళకవి :

ఇతఁడు "[1]రాజగోపాలవిలాస" మను ప్రబంధమును విజయరాఘవాంకితముగా నొనర్చెను. చంపకవనమున శ్రీకృష్ణుఁడు తన యష్టనాయికలతో సలుపు యష్టవిధలీలావిశేషము లిందు వర్ణితములు.

పురుషోత్తమదీక్షితుఁడు :

ఇతఁడు "[2]తంజాపురాన్నదానమహానాటక" మును విరచించి విజయరాఘవుని వితరణశీలతను శ్లాఘించెను. అముద్రితము.

కామరసు వెంకటపతిసోమయాజి :

ఇతఁడు "[3]విజయరాఘవచంద్రికావిలాస" మనెడి గ్రంథమును గ్రథించెను. ఇది యక్షగానరూపమున నున్నది. అముద్రితము.

కోనేటి దీక్షితచంద్రుఁడు :

ఇతఁడు "[4]విజయరాఘవకల్యాణ" మను నాటకమును రచించెను. విజయరాఘవనాయకుని కులగురు వగు శతక్రతు శ్రీనివాసతాతాచార్యుల ప్రియశిష్యుఁడు. ఇతని తండ్రి రామానుజాచార్యులు. విజయరాఘవ కాంతిమతుల వివాహ మిందుఁ బ్రధానకథావస్తువు. అముద్రితము.

---

1. తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయమువారిచేఁ బ్రచురింపఁబడినది. సంపాదకులు – శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు, M.A.
2. తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయములో నున్నది. D. No. 529; M. No. 684.
3. తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయములో నున్నది. D. No. 603; M. No. 686.
4. తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయములో నున్నది. D. No. 602; M. No. 701.

రంగాజమ్మ :

రంగాజమ్మ విజయరాఘవుని యాస్థానములోని కవయిత్రులలో ముఖ్యురాలు. ఈమెయొక్క శృంగారరసతరంగితకవితానైపుణ్యమునకు ననితరసాధారణమైదుష్యమునకును మెచ్చి విజయరాఘవుఁ డీమెకుఁ గనకాభిషేక మొనరించెను. ఈమె తండ్రి పసపులేటి వేంకటాద్రి, తల్లి మంగమాంబ. ఈమెను గూర్చి "ఉషాపరిణయము" యొక్క యుపోద్ఘాతమున వివరముగఁ జర్చింపఁబడి యున్నది. విజయరాఘవుని యాస్థానమున నీమెయొక్క పరిస్థితివిషయమున ననేకవిభిన్నాభిప్రాయము లుప్పతిల్లినప్పటికి నాంధ్రకవితాలోకమునకు నాంధ్రసారస్వతప్రపంచమునకును నీమె నిత్యస్మరణీయురా లగు ఆంధ్రనారీరత్న మనుట నిర్వివాదము.

రంగాజమ్మ కృతులు :

1. మన్నారుదాసవిలాసము (ప్రబంధము)
2. ఉషాపరిణయము ( ,, )
3. మన్నారుదాసవిలాసము (యక్షగానము)
4. రామాయణసంగ్రహము
5. భారతసంగ్రహము
6. భాగవతసంగ్రహము

ఇదిగాక యీమె రచించిన శృంగారరసము లొలుకు పదములు మొదలగునవి దొరకకపోవుట చింత్యమే.

---

1. తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయమున నున్నది. అముద్రితము. రెండు ప్రతులు నెం. D. 213, 214; M. 245, 246.
2. తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయమువారిచేఁ బ్రచురింపఁబడినది. సంపాదకుఁడు- శ్రీ విఠలదేవుని సుందరశర్మ.
3. 1927-వ సంవత్సరమున కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచేఁ బ్రకటితమైనది.
4, 5, 6. ఈ గ్రంథములు దొరకలేదు.

## మన్నారుదేవుఁడు - కృతికర్త :

ఇతఁడు విజయరాఘవనాయకుని కుమారుఁడు. వైదుష్యవిషయములలోఁ బితృపితామహుల కీతఁడు తీసిపోలేదు. "హేమాబ్జనాయికాస్వయంవర"మను నీ కృతిని "శృంగారరసగర్భసందర్భవిభాసురం" బుగా నిర్మించి తనవంశపారంపర్యముగా వచ్చు విఖ్యాతిని విశదీకరించిన కవిశిఖామణి. ఈతఁడు తన తండ్రితాతలవలనే పితృచరిత్రను విశదీకరించు "విజయరాఘవాభ్యుదయ"మను ప్రబంధమును నిర్మించెను. హేమాబ్జనాయికాస్వయంవరమున నీ విషయము వ్యక్తముగా చెప్పఁబడి[1]యున్నది. కాని యీ విజయరాఘవాభ్యుదయ మింతవఱకు దొరకలేదు.

## చారిత్రకవిశేషములు :

ఇతఁ డుత్తమరాజకులమందు జన్మించి సకలసద్గుణసంపన్నుఁడై యుండియు దక్షిణాంధ్రరాజ్యసింహాసన మధిష్ఠించని రాజకుమారుఁడు. ఇతఁడు కొంతకాలము కారాగారబద్ధుఁడై యుండెను. తంజాపురసామ్రాజ్యమును మధురచొక్కనాథుని సైన్యములు కబళించుటకై తంజావూరును సమీపించినవి. ఆసమయమున నాసన్ను లందఱి నిరాదరణకుఁ బాత్రుఁడైన విజయరాఘవనాయకుఁడు కారాగారమున నున్న తనపుత్రుని గారావిముక్తుని గావించి యతనితో సమాలోచన జరిపి చొక్కనాథునితో యుద్ధమునకే తీర్మానించెను. ఆసమయమునఁ దన తండ్రితో గలసి యుద్ధమునకు వెడలి తంజావూరుసమీపమున యుద్ధరంగమునఁ దండ్రితోసహా చొక్కనాథునిచే నిహతుఁడై వీరస్వర్గ మలంకరించిన వీరశిఖామణి మన్నారుదేవుఁడు.

విజయరాఘవనాయకుడు సకలసద్గుణోపేతుఁడును, వీరుఁడు ధీరుఁడు నగు తన యేకైక పుత్రుని కారాబద్ధునిగాఁ జేయుటకుఁ బ్రబలము లగు కారణము లుండవలెను. మన్నారుదేవుఁడు కారాబద్ధుఁ డౌటకు

1. హేమాబ్జనాయికాస్వయంవరము, కృత్యవతారిక, కృత్యుపసంహారము— "విజయరాఘవాభ్యుదయాదిప్రబంధనిబంధనచాతురీధౌరేయుండును".

పూర్వమే యతనికి చెంగమలదాసుఁడని యొక పుత్రుఁడుండినట్లును వీరిద్దఱు విజయరాఘవుని యాస్థానమునందుండినట్లు "ఉషాపరిణయము యొక్క యవతారికయందు వ్యక్తముగ నున్నది.[1] ఆస్థానమునఁ దనతో సమానముగఁ గూర్చుండఁదగిన యోగ్యతలతో నొక పుత్రుఁడున్న నతడు సుమారు 15 లేక 20 సంవత్సరముల వయస్సుగలవాఁడై యుండవల యును. అంతటి కుమారుని గల మన్నారుదేవునికి 35 లేక 40 సంవత్సరములైన నుండును. అట్టియెడ శౌర్యధైర్యాదిగుణముల విరాజిల్లు మన్నారుదేవుని గారాబద్ధునిగాఁ జేయుటకుఁ బ్రబలము లగు కారణము లుండియే తీరవలయు ననుట యుక్తము. కాని మన్నారుదేవుని చరిత్రను వ్రాయు నపుడు చరిత్రపుట లునిరక్షరము లగుచున్నవి. సరియైన కారణము లెచ్చటను దెలుపఁబడియుండలేదు. "కోపోద్రిక్తుఁడగు విజయరాఘవ నాయకుఁడు. తన పుత్రుఁడగు మన్నారుదేవుని కారాగారమున నుంచె" నని మాత్రము టైలరు గ్రంథము తెలుపుచున్నది.[2]

తంజాపురనాయకరాజులచరిత్రమును (The Nayaks of Tanjore) వ్రాసిన శ్రీవృద్ధగిరీశన్ M A; M. Litt, L. T; గారును నీ విషయమున నేమియుఁ దెలియుట లేదని వ్రాసియున్నారు. కాని foot note లో శ్రీ నరసింహాలు నాయుఁడుగారి దక్షిణయిండియా చరిత్ర (రెండవ భాగము) నుండి మన్నారుదేవుఁడు కారాబద్ధుఁ డౌటకుఁ గల కారణముగా నీక్రింది విచిత్రకథ నుదహరించియున్నారు.

---

1. "మహితప్రభావుండగు మన్నారుదేవుండును తతయశోధనుండగు తాతఘనుండును రంగద్గుణవిలాసుండగు చెంగమలదాసుండును మొదలగు నిఖిలజన మిత్రులైన పుత్రులును, నిరుపమచరిత్రపవిత్రులైన పౌత్రులును" రంగాజమ్మకృతి యుషాపరిణయము ప్రథమాశ్వాసము, పుట–3.

2. "That in a transient fit of anger he had put irons on his son Mannarapa-Naicker, and he confined him in prison." Oriental Historical Manuscripts by William Taylor, Vol. II-page 195.

"మంత్రియగు గోవిందదీక్షితులయొక్క కుమార్తెలలో నొకతెను మన్నారుదేవుఁడు ప్రేమించెను. ఈ విషయమును గోవిందదీక్షితుఁడు విజయరాఘవుని దృష్టికి తేగా కోపోద్రిక్తుఁడైన విజయరాఘవుఁడు మన్నారుదేవుని జెఱలో నుంచెను[1]" పై పంక్తులను జూచినదే యదెంత యసంగతమైన విషయమో యెల్లరకు తెలిసినదే. గోవిందదీక్షితులు దాదాపు అచ్యుతనాయకుని కాలములోను రఘునాథుని కాలమున నారంభ దశయందును నున్నట్లు చరిత్ర విశదపరచుచున్నది. తర్వాత నాస్థానమును కుమారతాతయాచార్యులు క్రమముగా శ్రీనివాసతాతయాచార్యులును నలంకరించిరి. విజయరాఘవుని కాలమున గోవిందదీక్షితులే లేనప్పుడు మన్నారుదేవుని జెఱనుంచుట కతఁడు కారణ మగుట దురూహ్యము. గోవిందదీక్షితుల వంశమే విజయరాఘవనాయకుని కాలమున తంజావూరులో నుండిన దనుటకూడ సందేహాస్పదమే. ఒకవేళ నా సమయమునఁ గులగురువు, మంత్రి, యాస్థానపండితుఁడు సమస్తము నగు శ్రీ శ్రీనివాసతాతాచార్యుల కుమార్తెలలో నొకతెను మన్నారుదేవుఁడు వరించి యిట్లు దుర్గతిపాలాయె ననుట యుక్త మగునేమో! కాని యీ కారణము లన్నియు నమ్మఁదగినవిగఁ దోచుటలేదు. విజయరాఘవ నాయకుఁ డంతటివాఁడు స్వల్పకారణములను బెద్దచేసికొని విమలయశుఁడును శౌర్యసాహసోపేతుఁడును నగు మన్నారుదేవుని జెఱబెట్టి తన వంశగౌరవమును మంటగలుపునా! దాని కేదో రాజకీయము లగు కొన్ని ముఖ్యకారణము లుండక తప్పదు. ఆచోటనే చరిత్ర మౌనముద్ర వహించుచున్నది. మన్నారుదేవుఁడు చెఱనుండి విముక్తుఁడుకాగానే తన తండ్రిని జూచి యీ క్రిందివిధముగఁ బల్కెనట —

---

1. "The reason for his imprisonment is not known. Tradition has a fanciful story to tell. It says that he advanced his love to one of the daughters of Govinda Dīkshita and when this was brought to the notice of the Nayaka by the minister himself, he ordered him to be put into prison" (The Dakshina India Charitram by Narasimhalu Naidu Vol. II) The Nayaks of Tanjore by Sri V. Vṛidhagirisaṇ M.A; Ṃ. Litṭ. L.T;

క. మణిఁ గెంపుపఱచి జలనిధి
తృణముఁగా బైనుంచె నతని దే కొదవ సుమీ!
మణి మణియె తృణము తృణమే
రణవిజయదిలీప! విజయరాఘవభూపా[1]!

పై పద్యమును విన్న దే యపారపుత్రవాత్సల్యాక్రాంతుఁ డగు విజయ రాఘవుఁడు మన్నారుదేవుని గాఁగలించుకొని తన యానందబాష్పాంబు ధారలతో నతని నభిషిక్తుని గావించె నట. పై విషయములను బరిశీ లించినచో మన్నారుదేవుని నిష్కళంకతయు నతఁడు కారాబద్ధుఁ డగు టకు కొన్ని రాజకీయములే కారణములుగ నుండవచ్చుననుటయు స్పష్టము కాఁగలదు. "హేమాబ్జనాయికాస్వయంవర" మను నీ గ్రంథమును నితఁడు కారాగారమున నుండగా రచించెనని నానుడి. మనకు దొరకని "విజయరాఘవాభ్యుదయము" నటుంచి యీ హేమాబ్జనాయికా స్వయంవరమును బరిశీలించినను గూడ నీమన్నారుదేవుఁ డెంతటి పితృ భక్తిగలవాఁడో విశదము కాఁగలదు. ఇట్టి తంజాపురాంధ్రనాయకరాజ్య సింహాసనము నధిష్ఠించని రాజకుమారుఁడును మహితప్రభావుఁడును నగు మన్నారుదేవునికిఁ జరిత్రయందును నధికప్రాధాన్యము లే క పో వు ట చింత్యమే.

హేమాబ్జనాయికాస్వయంవరము :

ఈగ్రంథము తంజావూరుసరస్వతీమహాల్ గ్రంథాలయమున నున్న తాళపత్రాత్మకమైన గ్రంథము. పై గ్రంథము సవివిరణ సూచీపత్రము (The Descriptive catalogue of Telugu Manuscripts in the Tanjore Maharaja Serfoji's Saraswathi Mahal Library, Tanjore) నం దీక్రింది విధముగ వివరింపఁబడియున్నది.

---

1. Oriental Historical Manuscripts by William Taylor, Vol. II Page No. 195.

674 హేమాబ్జనాయికాస్వయంవరము (మన్నారు దేవుఁడు)

M. 675 ; S-17×3/4 ; L-40 ; 11-6 ; G. 960.

Beginning
End } ఈ మూఁడును క్రమముగ నివ్వఁబడియున్నవి.
Colophon

Subject :—హేమాబ్జనాయికాస్వయంవరము. మన్నారు కొలు వుండగా నొకనాడు దేవతలు వచ్చి వానితో సముద్రమథనవిషయము విన్నవించిరి. మన్నారపుడు వెడలి పాలమున్నీట బుట్టిన యమృతంబు దేవతల కొసఁగి సముద్రుని కన్య యగు రక్తాబ్జ యను నామెను వివాహ మాడెను. ఈకథ యిందు వర్ణితము.

Remarks :—సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

This work is Hēmābjanāyikāswayamvaramu by Mannārudēva the son of king Vijayaraghava Nayak. The author refers herein to another production of his Vijayarāghavābhyudayamu, which is however unfortunately lost to us.

మన్నారుదేవుఁడు తనతండ్రి యగు విజయరాఘవనాయకుని యనుమతిని నీ గ్రంథము ను శృంగారరసగర్భసందర్భవిభాసురంబుగా రచించె నట. ఈ మధురశృంగారకావ్యము యక్షగానరూపమున నున్నది. తొలుదొల్త 'మన్నారుగుడి' యను చంపకారణ్యక్షేత్రమున వేంచేసి యున్న తమకులదైవ మగు శ్రీరాజగోపాలస్వామి దేవి చెంగమలమ్మ యొక్క ప్రార్థన. తర్వాత సంప్రదాయానుగతముగ నందటి సమస్కారా నంతరము గ్రంథము ప్రారంభింపఁబడినది.

కథాసంగ్రహము :

దక్షిణద్వారక (మన్నారుగుడి) యందు శ్రీరాజగోపాలుఁడు పదియాఱువేవురు చెలువలు గొలువ గొలువై యుండి సంగీతనాట్యాదిసకల కళావిశేషములయం దాసక్తుఁడై యుండ నజుఁడు మొదలగు దేవతలు

వచ్చి క్షీరాబ్ధిని మథించి తమ కమృతమును బంచిపెట్టు మని వేడిరి. వెంటనే వారితోఁ గూడి శ్రీరాజగోపాలుఁడు క్షీరవారిధికడ కేగి దానవుల రప్పించి వారిని పెన్నుద్దులై క్షీరసముద్రమును మథింప నియమించి మందరధరాధరమును గవ్వఁపుఁగొండగాఁ జేసి వాసుకిని దరిఁ(త్రా)డుగా నేర్పఱచుట, దేవదానవు లట్టహాసములు జేయుచుఁ బాలసముద్రమును మథింప నందుద్భవించిన హాలాహలమును బరమేశ్వరుఁడు కబళించెను. తర్వాత పారిజాతము ఉచ్చైశ్శ్రవము కామధేనువు చంద్రుఁడు కల్పవృక్షములు చింతామణి అమృతకలశము కౌస్తుభమణి మొదలగునవి క్షీరసాగరమున జనించినవి. అదేసమయమున నాపాలసముద్రమునుండి చెంగమలమ్మ యవతరించినది. శ్రీరాజగోపాలస్వామి చెంగమలమ్మయుఁ బరస్పరము మరులుకొనుట, అమృతమును పంచుకొనుటయందు దేవదానవులకు సంభవించిన వాగ్వివాదమును బరిష్కరించి యమృతరసమును నమరులకుఁ బంచిపెట్టి దైతేయుల వంచించుటకై శ్రీరాజగోపాలుండు మోహినియై వచ్చి యమృతమును నాదితేయులకు నిచ్చి దక్షిణద్వారకాపురంబు జేరుట, హేమాబ్జనాయిక విరహవేదనచే మిగుల తపించి రూపవతి యను చెలిని మన్నారువద్దికి రాయబార మంపుట, శ్రీరాజగోపాలుఁ డామెను స్వయంవరమునఁ బరిణయమాడుటకు సమ్మతించుట, చెంగమలారాజగోపాలకులు విరహవేదనాసంతప్తు లగుట, ఆసందర్భమునఁ దంజాపురాధీశుఁ డగు విజయరాఘవుండు మన్నారుదర్శనమునకై వచ్చి యీతని విన్నదనంబునకుఁ గారణ మడుగ వివరముగా దెలిపి శ్రీరాజగోపాలుఁడు చెంగమలాదేవికిని తనకును వివాహము జరిపింపు మని కోరుట, విజయరాఘవనాయకుఁడు సముద్రరాజువద్ద కరిగి హేమాబ్జనాయికారాజగోపాలుల వివాహము నేర్పఱచి వివాహము జరిపించి వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁ డగుట మొదలగు కథాసందర్భము లతిమనోహరముగ వర్ణితములు.

## వైశిష్ట్యము - విశేషములు :

ఈ హేమాబ్జనాయికాస్వయంవర మించుమించు తంజాపురాంధ్ర నాయకరాజులకాలములో నాంధ్రభాష చెందిన యభివృద్ధియొక్క పరాకాష్ఠను దెలుపునదిగాఁ జెప్పనొప్పును. మన్నారుదేవునితో తంజాపుర

నాయకరాజ్య మంతరించినట్లే. తర్వాత మహారాష్ట్రుల పరిపాలనము వచ్చినది. ఇతని కృతులలోఁ గూడ నిది రెండవదియు గడపటిదియు నగును. ఈ కృతియే తంజాపురాంధ్రనాయకరాజు లాంధ్రభాషామతల్లి కర్పించిన గ్రంథకుసుమాంజలిలోని కడపటి పుష్పము. గ్రంథములోని కొన్ని విశేషముల గమనింతము—— దేవాసురయుద్ధము, సముద్రమథనము, అందపూర్వవస్తువు లుద్భవించుట, కలశాబ్ధికన్యావిర్భావము, ఆమె శ్రీవిష్ణుమూర్తిని వివాహమాడుట ఇత్యాదిసంభవము లెక్కడ! విజయరాఘవనాయకుని తంజాపురాంధ్ర రాజ్యపరిపాలనాకాల మెక్కడ! చెంగమలారాజగోపాలకుల వివాహమునకు విజయరాఘవుఁడు మధ్యవర్తి యగుట యెంత యసంభవము, కాని యిట్టి యసంభావితసంభవములను గూడ సుతలితముగఁ జిత్రించి రసికుల రంజింపఁజేసిన మన్నారుదేవ నాయకుని నైపుణ్యము ప్రశంసార్హము.

పై విధముగ నపూర్వచిత్రణమున నీతని లేఖిని ప్రసరించుట కీతని కులదైవమగు శ్రీ రాజగోపాలస్వామియందును దనతండ్రి యగు విజయరాఘవనాయకునియందును దనకు గలిగిన విశృంఖలితభక్త్యావేశవివశతయే కారణముగాఁ జెప్పనొప్పును. విజయరాఘవనాయకునిచే రచింపఁబడిన "విప్రనారాయణచరిత్ర" మందును నీవిధముగనే యసంభావితకల్పన యొకటి గలదు. ఆ గ్రంథకర్త విజయరాఘవుఁడు, గ్రంథప్రతిపాద్య మగు విప్రనారాయణుని విచారణచేయు సభ కధిపతియు విజయరాఘవుఁడే.

**శైలి :**

నాయకరాజులకాలమునాటి యాంధ్రభాషాభివృద్ధికి నాటియాంధ్ర భాషామతల్లి యొక్క బహువిధవిలాసములకు నీ హేమాబ్జనాయికాస్వయంవర మొక యుదాహరణము కాఁగలదు. పదము లతిసరళములు, కాని భావము గంభీరము. సంభవము లతిసంకటములు, కాని మనోహరముగ వర్ణితములు, జాను తెనుఁగు పదగుంభనతో శృంగారరసతరంగితకథాసందర్భ

ముతో నిట్టి మనోహరకావ్యఖండమును సృష్టించి కవితావైశిష్ట్యమును చాటిన మన్నారుదేవనాయకుఁ డాంధ్రపాఠకలోకముచే వేనోళ్లఁబొగడఁ దగినవాఁడనుటలో నత్యుక్తిలేదు. జాను తెనుఁగుయొక్క సంపూర్ణవికాస మును, నాటి శృంగారహాస్యాదిరసగర్భితకావ్యానుభూతిఁ గోరువారికిని నీ హేమాబ్జనాయికాస్వయంవర మొక యనితరసాధారణమైన విందు.

పరిష్కరణము :

ఈ సరస్వతీమహాల్ గ్రంథాలయములోని M. 675; D. 674. సంఖ్య గల యేకైక తాళపత్రప్రతియే యీ ముద్రణమునకు మాతృక. వ్రాఁత చక్కగను శుద్ధముగ నుండి తప్పు లధికముగ లేకుండుట పరిష్కరణమున కధికముగఁ దోడ్పడినవి. మాతృకాగతములగు పాఠములు దిద్దఁబడిన చోట్ల యథామాతృకాపాఠములు క్రింద (foot note) నివ్వఁబడియున్నవి. ఇట్టి యపూర్వమగు గ్రంథమును బరిష్కరింప నన్ను నియమించినందులకు సరస్వతీమహాల్ గ్రథాలయనిర్వాహకసంఘ గౌరవకార్యదర్శి యగు శ్రీయుత యస్. గోపాలన్, B A: B L: గారికి నా మనఃపూర్వకాభివంద నముల నర్పించుచున్నాను. తెలుగు ముద్రణమునందుఁ బరిపూర్ణానుభ వము గల "రత్నం ప్రెస్" నందీగ్రంథము ముద్రింపఁబడుట ముదావహము.

శుభమస్తు.

సరస్వతీమహాల్ గ్రంథాలయము,
తంజావూరు. 16-7-1956

విఠలదేవుని సుందరశర్మ

శ్రీరస్తు.

శుభమస్తు.

# హేమాబ్జనాయికాస్వయంవరము

## (యక్షగానము)

## మన్నారుదేవవిరచితము



సీ. శ్రీరమణీసముజ్జృంభమాణకటాక్ష
హారమణీలసద్భూరివక్ష !
వార్తాచమత్కార వైభవప్రదనామ !
మార్తాండమండలమహితధామ !
మాణిక్యకేయూరమండితభుజదండ !
చాణూరగర్వశిక్షాప్రచండ !
తంజాపురాధిపస్తవనీయచారిత్ర !
కంజాతపత్రసంకాశనేత్ర !

గీ. ద్వారకాధీశ ! కాంచనవసననివేశ !
పాకరిపుమిత్ర ! చంగమలాకళత్ర !
మముఁ గటాక్షించి శుభలీల మనుపు జాల
రాజగోపాల ! రాధికారతివిలోల !

పరాకు స్వామి !

ద్వి. శ్రీరాజగోపాల ! జితదైత్యజాల !
నారదస్తుతిలోల ! నవనీయలీల !
ఫుల్లాంబురుహనేత్ర ! పుణ్యచారిత్ర !
ఉల్లసన్మణివేత్ర ! యుర్వీకళత్ర !

బాణబాహువిదార ! పర్వతోద్ధార !
వేణుగానవిహార ! విబుధమందార !
కాళియమదభంగ ! ఘనకృపాపాంగ !
నీలవర్ణ ! శుభాంగ ! నిగమాంతరంగ !
రక్తాబ్జవల్లీశ ! రమ్యప్రకాశ !
భక్తచిత్తనివేశ ! భానుసంకాశ !
నారీమనోహారి ! నవ్యశృంగారి !
కారుణ్యగుణహారి ! కౌస్తుభధారి !
గజరాజసంరక్ష ! కంసవిపక్ష !
విజయరాఘవుదేవ ! వినుతప్రభావ !
నీ పట్టిపట్టినై నెగడిన నన్ను
జేపట్టి రక్షించు చెండలంకార !
కనకాంబురహావల్లి కాంతామతల్లి !
నను గన్నతల్లి ! యానతకల్పవల్లి !
కదలిరాజకుమారి ! కలిమిమిటారి !
వెడవిల్తుగన్నమ్మ ! వెలలేని సొమ్మ !
తళుకు బంగరుబొమ్మ ! తావులరెమ్మ !
చెలువమన్ననికొమ్మ ! చెంగమలమ్మ !
నిరతంబు భావింతు నిన్నె సేవింతుఁ
గరుణమీరఁగ నన్ను గడు గటాక్షింపు
హరిదళవాయి ! సర్వాభీష్టదాయి !
పరమవైష్ణవధుర్య ! పావనచర్య !
సూత్రవతీనాథ ! సుగుణసనాథ !
చిత్రచారిత్ర ! యాశ్రితపద్మమిత్ర !
కరమున రాణించు కనకవేత్రమున
దురితంబు లన్నియు దొలఁగింపవయ్య !

వ. అని వినతు లొనర్చి యనంతగరుడుల కనంతనమస్కారంబు లాచరించి పంచాస్త్రజనకుని పంచాయుధంబుల నుతించి, వన్నె మీరఁ బన్నిద్దరాళువారుల నిత్యసూరుల నారాధించి యాదిమకవుల నాదరించి కుకవిలోకంబు నిరాకరించి యతులితాశ్చర్యతపశ్చర్యు లగు శతక్రతు శ్రీనివాసతాతాచార్యులకు గంభీరసూక్తుల సంభావన మీర నమస్కరించి నిజవంశకర్తయై వార్తకెక్కు చెవ్వ భూభర్తను గీర్తించి తనదు ప్రపితామహుని మహా మహుని వీరవైష్ణవసార్వభౌముని యచ్యుతాళ్వారుల నభినుతించి తనదు పితామహుని యభినవభోజుని రఘు నాథజననాథబిడౌజుని సన్నుతించి శాశ్వతైశ్వర్యంబున వెలయుచు విశ్వవిశ్వంభరాచక్రం బాచంద్రతారార్కం బుగా బాలింపుచు చాల వర్ధిల్లుచున్న తనతండ్రి యగు విజయరాఘవభూపాలచంద్రుని యుదారపదారవిందంబు లకు వందనంబు గావించి యతని యనుమతి గాంచి హెచ్చుగా వెలసిన యల చినచెవ్వయాచ్యుతాధిప ప్రపౌ త్రుండును రఘునాధజనాథపౌత్రుండును విజయరాఘవ భూపాలకప్రియపుత్రుండును రాజగోపాలకాంబికాగర్భ కలశజలధికువలయ మిత్రుండును, అతులకనకతులాప్రముఖ నిఖిలమహాదానదీక్షాధురీణుండును, అనేకాగ్రహారప్రతి ష్ఠాపనప్రవీణుండును, విజయరాఘవాభ్యుదయాది ప్రబంధ నిబంధనచాతురీధౌరేయుండును, అతులితపితృభక్తిగురు భక్తిభాగధేయుండును మహితానుభావుండును నగు మన్నారుదేవుండు భువనస్తవనీయంబుగా హావణించు శృంగారరసగర్భసందర్భవిభాసురం బగు హేమాబ్జనాయికా స్వయంవరం బను నాటకంబునకు కథాసంవిధానం బెట్టి దనిన,

ద్వి. వరకవీంద్రులు మెచ్చ వసుమతిమీఁదఁ
దిరమగు నమరావతీపురం బనఁగ
బాగైన నెఱదంటపంటవాల్గంటి
పై గోవరతనాల పదకం బనంగఁ
బట్టైనదిక్పాలపట్టణంబులకు
దట్టంపు మెఱుఁగునిద్దపు టద్ద మనఁగఁ
బ్రజలకు కన్నులపండువుల్ సేయు
గుజరాతికెంపురాగుంపు రాణించు
మెచ్చులగోడల మేటికిరీటి
పచ్చలమేడల బటువునీలంపు
నిగరాలకోటల నిండుచెక్కడపు
మగటాలపేటల మానికంబులను
దీరినవీధులఁ దేజంబుచేత
మీరిన జోదుల మేలి[1]కడాని
తేరులచేత ముస్తీదైన మస్తు
గారులచేత చొక్కపు విరిదేనె
కొలఁకులకెలఁకుల కొత్తనెత్తావి
కలువలచలువల కలికిరాచిలుక
పలుకులకులుకుల పటువీరభటుల
కలుములబలుముల కవిబుధోత్తముల
మాటలతేటల మరులుబుట్టించు
బోఁటులసీటుల పొలుపొంద రాయ
బారులబారుల బ్రహ్మజ్ఞులైన
పారుల పౌరుల భాసురం బగుచు

1. కడాణి.

జగతీసతీమణిచరణనూపురము
గగనపరిస్ఫురత్కనకగోపురము
శరధికన్యావిలాసముల దాఁపురము
ధర నొప్పు దక్షిణద్వారకాపురము.

వ. ఆరాజధాని బాలించు వేయంచులకైదువ దాల్పు విజయ రాఘువుపాలివేల్పు కన్నెలకన్నుదోయివెన్నెలపులుగుల వలపించు కలువలరేఁడు కరుణారసము వెదచల్లు కడకంటి చూపులవాఁడు రాధావధూమోహనశీలుండు రాజగోపాలుండు చెలువుమీఱ పదియాఱువేవురు చెలువలు గొలువ కొలువుకు వచ్చె నట యెటువలెను.

పదం - మధ్యమాది - ఆది.

కొలువుకు వచ్చెను గోపాలదేవుండు
చెలువైన రతనాలకొలువు కూటము జేర 1

బంగారుచాయల బాగుమీఱిన యట్టి
చెంగోలు కెంగేల చెలువుగా బట్టి
రంగుగా శిగను సంపంగిసరులు జుట్టి
పొంగుచు హాయిలుగా బురుసారుమాలు గట్టి. 2

వ. ఈదారి రాజగోపాలశౌరి చెలువుబొంగార కొలువుశింగారమై పదాఱువన్నెబంగారు కొలువుకూటంబునకు వచ్చియందు చెన్నొందు వినూత్ననవరత్నసింహాసనంబు జేరి చెలువుమీఱి సుఖువుపట్టుగద్దియపై గూర్చుండి యిరుగడల పదియాఱువేవురు చెలువలు గొలువ నొక్కచక్కని కొమ్మను చొక్కపుమాటల దేలింపుచు నొక్క జక్కవగుబ్బెతకు పుక్కిటివిడెము బాలింపుచు నొక ముద్దులగుమ్మసుద్దులకు సొక్కుచు నొక యిందుముఖి

మోవివిందుకై మొక్కుచు నొక్క మిటారిచెక్కిలి గోర జీరుచు నొక జవ్వనితో నవ్వుచు పెరజీరుచు, నిత్తెలంగున శింగారలీలల దేలుచున్న బంగారుమన్నారు తన చెంగట నున్న యొక యంగనను జూచి యే మనుచున్నాఁడు.

గోపాలుని మాట :— రావె ఓ బరాబరి ! మననాటకశాల లోని బిరుదుపాత్రను రప్పించవే.

బరాబరి మాట :— ఓస్వామి! ఆలాగే తోడితెచ్చేనయా!

వ. అని పలికి యాచెలువ బిలువ నయ్యంగజజనకుని చెంగటికి సంగీతమేళంబుతో నొక యంగనామణి వచ్చి నట మెటువలెను.

దరువు - బిలహరి - ఆది.

సంగీతమేళంబు జత జేసుకొని యొకతె
శృంగారనాయకుని చేర వచ్చె నపుడు.

వ. ఈరీతి జేరి యా నారీతిలకం బాకనకవనవిహారునకు జోహారు జేసె నట మెటువలెను.

మొక్కేను మొక్కేనయా చక్కనిమన్న !

వ. ఇక్కరణి మొక్కిన యక్కనకాంగితో చక్కని మన్నఁడే మనుచున్నాఁడు.

స్వామి మాట :—రావే ఓబాలిక ! ఇంచుకసేపు పదకేళిక వినుపించుమమా.

—: అంతర్నాటిక :—

చెలి యాడేమాట :— ఓస్వామి ! మహాభాగ్యము, ఆలాగే నేర్చిన యాట్లు వినిపించే నయ్యా !

వ. అని మందలించి యాకెందలిరుఁబోణి కుసుమాంజలి యొసఁగె నట యెటువలెను.

—: కేళిక వినుపించే పాత్ర చదివే శ్లోకం :—

"రాజగోపాయ విజయరాఘవాభీష్టదాయినే
రాజద్గుణకలాపాయ రచయే కుసుమాంజలిం"

వ. ఇవ్విధంబున నవ్వధూటి విరచితకుసుమాంజలియై రంజిలి యాకంజలోచనుని యెదుటజేరి యుదుటుమీరి దరువుల హారువుల పాటలనీటుల పలుకులకులుకుల కన్నులసన్నల వన్నెమీరి కొంతసేపు వింతకోపులయేపుజూపునై వుణి గనుపించ పదకేళిక వినుపించె నట యెటువలెను.

పదం - తోడి - - ఆది.

వలచినదాన నంటూ నావాదుసేసేవు
చెలువమన్నారు మొక్కేరా చెలిమితో నన్నేలుకోరా. 1
సారె వేడుకొన్నా రాక చలముసేతురా యిందాఁక
శౌరార! నాపై దయలేక యలయించే వేమి పరాకా 2

వ. ఇటువలె నటించిన యల పాటలగంధియాటపాటలకు మెచ్చి యెంచదగు రతనంపుసొమ్ములు కాంచనాంబరమ్ములు బాలించి లాలించి నారీమణులతో పేరోలగం బుండె నట యెటువలెను.

వ. ఈ చెలువున నిండుగొలువున నుండు చిలువఖాణంపు కంఖాణంపు తేజి నెక్కు జేజేవజీరుసమ్ముఖమ్మునకు సమ్మదమ్మున నవసరమ్ములవారు వచ్చి రట యెటువలెను.

దరువు - ముఖారి - రూపకం.

బంగారుమన్నారు చెంగటికి వచ్చిరి
పొంగుచు నవసరమ్ములవార లపుడు.

వ. ఈ రీతి జేరిన యవసరమ్ములవా రానవసరోజాక్షునితో నవసరోచితవార్తల నే మనుచున్నారు.

అవసరాల మాట :— స్వామీ! దేవాధిదేవ! పరాకు! తామరచూలిమొదలైన దేవతాధీశులు దేవరసమ్ముఖమ్ము పొడఁగనఁ దలంచి వచ్చి కాచుక యున్నారు స్వామిచిత్తం.

గోపాలస్వామి మాట :— ఆలాగే వార్ని రప్పించరోయి!

వ. అనిన విని వారు బిలువ చెలువమర చెలువమన్నసి కొలువునకు నలువమొదలైన తెలుగంటిదొరలు వచ్చి రట యెటువలెను.

దరువు - సారంగ - ఆది.

జలజభవుఁడాదియౌ సకలదేవత లెల్ల
చెలువమన్నారు కొలువుకు చేర వచ్చి రపుడు.

వ. ఇవ్విధంబున వచ్చిన యవ్వేల్పువజీరు లాజగద్గురువుకు హారువుగా మొక్కి రట యెటువలెను.

దేవతల మాట :—మొక్కేము మొక్కేమయా
చక్కెర విల్తునిం గన్న సంపంగిమన్న!

వ. ఈ చందంబున వందనంబు లొనర్చి నరవిందభవపురంద రాదిబృందారకవీరుల వేరువేర జూపి కటికవారు వారివారి పేరుపేరింపు లెచ్చరించి రట యెటువలెను.

—: కటికవారు చదివే పద్యం :—

సీ. పరమేష్ఠి యదె నీకు ప్రణతు లొనర్చెని
రాజగోపాల ! పరాకు దేవ !
సంక్రందనుఁడు నమస్కారంబు చేసేని
రాధికాలోల ! పరాకు దేవ !
హవ్యవాహనుఁడు నీ కంజలి గావించె
రాజీవనేత్ర ! పరాకు దేవ !
దక్షిణాధీశుండు దండంబు పెట్టెని
రతిరాజ జనక ! పరాకు దేవ !

గీ. నైఋతుఁడు నీకు సల్లా మొనర్చె దేవ !
వరుణవాయుకుబేరులు వందనములు
చేసి రీశానముఖ్యులై చెలఁగు సురలు
నీకు మొక్కెద రయ్య ! పరాకు దేవ !

వ. అని కంచుకులు విన్నవింప మన్నారుసామి వేలుపు మన్నీల మన్ననమీఱ చేసన్నల నుచితరత్నఖచితపీఠమ్ముల గూర్చుండ నియమించి దయమించి మంజులకటాక్ష విలాసంబుల మందహాసంబుల గారవింపంగ నప్పొంగి వారలలో తద్దయు పెద్ద యగు విరించి హరిం గుఱించి యే మని కొనియాడుచున్నాఁడు.

ద్వి. జయ రాజగోపాల ! జయ రమాలోల !
జయ చంపకనివాస ! జయ చారుహాస !
జయ రుక్మిణీనాథ ! జయ దివ్యబోధ !
జయ సత్యసంకల్ప ! జయ భోగితల్ప !

ఆనారదసనందనాదిమానులకు
మానసవీధిసమాధిమార్గమున
జక్కని చక్కని చిన్మయమూర్తి !
మొక్కెము మీపదాంభోరుహంబులకు
కదిసి నీ సముఖంబు గాంచిన యపుడె
కొదవలు దీరె మాకోర్కె లీడేరె
నీ కసాధ్యం బేమి ? నేడు మామనవి
చేకొని రక్షింపు చెలువమన్నారు !

వ. అనిన విని ప్రసన్నుండై రాజమన్నఁ డారాజీవగర్భాదులగు జేజేవజీరుల జూచి యే మనుచున్నాఁడు.

పదం - సావేరి - ఆది.

నేమమా సురలార ! చేరవచ్చిన కార్య
మేమి ? మాతో దెల్పుఁ డీవేళ మీరు. 1

ఇందఱు వచ్చుచందము ముందుగా దెలిసినాము
మందలింపుఁ డైనను మక్కువ మీర. 2

ఎంతటి పనికైన యే గల్ల మీకింత
చింత యేఁటికి కోర్కె చేకూర్తు నిపుడె.

వ. ఈ చందంబున నందనందనుండు మందలింప నుల్లంబున నుల్లాసంబు పల్లవింప నల్ల దేవతావతంసు లాకంస వైరితో నే మనుచున్నారు.

పదం - పంతువరాళి - ఆది.

విన్నపము గల దొకటి వివరించెదము మేము
మన్నించి చిత్తగింపు మన్నారుదేవ ! 1

నిను నమ్మినారము నెనరుంచి నేడు మా
మనవి జేకొనవయ్య మరునిఁగన్నయ్య! 2

అమృతాబ్ధి మథియించి యమరవర్యుల కెల్ల
నమృతము బాలించి యాదరింపవయ్య! 3

వ. అనిన విని యపారకృపారసతరంగంబు లంతరంగంబున తుఱంగలింప విహంగపుంగవతురంగుండు వారి మనవి నంగీకరించి యే మనుచున్నాఁడు.

—: గోపాలస్వామి చదివే పద్యం :—

గీ. అమృతజలధి మథించి యయ్యమృతరసము
విందుగావింతు మీకు నోవేల్పులార!
యిందుకై యింత సందియంబేల? నిపుడె
చేరుదము రండు కలశాబ్ధితీరమునకు.

వ. అని లాలించి యభయమ్ము బాలించి యావేల్పుల దోడ్కొని వేడ్కతో గోపాలదేవుఁ డాపాలమున్నీటి చేరువకు జేర వచ్చె నట యెటువలెను.

దరువు - సౌరాష్ట్రి - ఆది.

చెలువమన్నారుసామి జేజేలు గొలువఁగా
కలశాబ్ధిచెంగటికి కదలి వచ్చె నపుడు.

వ. ఇవ్విధంబున వచ్చి యచ్చ్యుతుండు చెంగట నున్న కటికి వారిం జూచి యే మనుచున్నాఁడు,

స్వామి మాట :- రారోయి! కంచుకులార! ఈక్షణంబె
రాక్షసుల నీకడకు దోడి తేరోయి.

కటికి మాట :- ఓస్వామి! అలాగే తోడి తెచ్చేమయా!

వ. అని పలికి యాకటికివారు బిలువ సముచితసంరంభంబుతో నముచి జంభ నికుంభ శంబర హేతి ప్రహేతి కాలనాభ పౌలోమ కాలకేయ నివాత కవచాదిదైత్యవీరు లభంగుర సంగరశూరులు జలధిమథనాయత్తచిత్తులై భుజబలో న్మత్తులై యచ్చటికి వచ్చి రట యెటువలెను.

జతి – దరువు – నాట – ఆది.

చేకత్తు లెగజిమ్ముచు చెలఁగి మీసాలు దువ్వుచు
కేకలువేసి నవ్వుచు మూకలుగూడి
భీకరాకారులైనట్టి బిరుదురక్కసవజీరు
లాకలశాబ్ధిచెంత నున్న హరి జేర వచ్చిరి.

వ. ఇవ్విధంబున వచ్చునప్పు డప్పాలడిందిబలుదండిమగ లాండోరులు తమలో దా మే మనుచున్నారు.

—: రాక్షసుల మాటలు :—

ఓరె ! ఇప్పుడు మన మేడకు వస్తావుండాముర్రా ?

మరొకండు :- ఏరా ఓరె ! మరి స్త్రివి, ఆపాలసంద్రం దేవ ళ్లంతా మధియింస్తా వుండారంట, మనకు యిప్పింశేమంటూ కిచ్చమ్మ పిలిపింశె గదరా !

మరొకఁడు :- కిచ్చమ్మమాటలు ఓరె ! నమ్మరాదురా, ఓరె! అందుకు దోడు జంబారిగాఁడు కూడినాఁడురా, దొరకిన అమృతం లంకిం చుక పోదుట్టా ! ఓరె ! వాండ్లంతా విస పాలవిత్తులు వోటిరా వార్ని నమ్మ రాదురా !

మరొకఁడు :- ఆంహాఀ ఓరి ! నాముందఅనా ! గద తీసు
కొనే వేయనా !

మరొకఁడు :- ఓరి నన్నేల కొట్టితివిరా ?

మరొకఁడు :- నువ్వా, నువ్వు దాదోంగ్రా ! నీ పేరుదా
యేమిరా ?

మరొకఁడు :- నేనా నాపేరా ! నీవే నేదా.

మరొకఁడు :- నన్ను నీవంటూవుండావా
ఓరె ! వీనికి వెట్టిబట్టె నేమో !

మరొకఁడు :- ఓరె ! నాతోడు నాకు వెట్టిబట్టె, నీ కెట్లా
దెలిశెరా! అహాహాఀ ! శబాసు వగకంటివిలె.

మరొకఁడు :- నీకన్నా వెట్టివాఁడ గనక నాకు దెలిశెరా.

మరొకఁడు :- ఇప్పు డిప్పుడుదా వీనికి వెట్టి సోఁకుతా
వస్తా వుండది.

మరొకఁడు :- ఓరె ! అందుకేమాయరా మనచాత
గాదంటరా ! రారా !

వ. ఇవ్విధంబున బలుకుచు వచ్చిన యవ్వెయచ్చరవైరు లచ్చుతునకు సముల్లాసంబున సల్లాముజేసి రట యెటు వలెను.

దరువు - పంతువరాళి - అట.

సల్లాము సల్లామయ్యా సంపంగిమన్న !
సల్లాము సల్లామయ్యా !
వల్లవీమోహనాకార ! వసుదేవకుమార !
(సల్లాము సల్లామయ్యా !)

వ. అనిన విని కనకవసీవినేత యాద్దైతేయవ్రాతంబు జూచి కౌతుకంబున నే మనుచున్నాఁడు.

గోపాలస్వామి మాట :-రారోయి ! దైత్యవీరులార ! మీర లమరులతో సరిగాగ నమృతరసంబు సరుసుకొందురు గాని, యీసుధాజలనిధాన మథ నంబునకు పెన్నుద్దులై యుండ రోయి !

రాక్షసుల మాట :-ఓస్వామి ! మహాభాగ్యం, ఆలాగే ఆన తిచ్చిన బుద్ది విని నడుచుకు నేమయ్యా !

వ. అనిన విని వారి నాదరించి యామురవైరి సురవీరుల జూచి సమ్మోదంబున నమ్మహార్ణవం బేమని వర్ణింపుచున్నాఁడు.

—: గోపాలస్వామి చదివే ద్విపద :—

శ్రీకరం బగుచు నశేషసత్వముల
కాకరం బగుచు దివ్యారామతతుల
భవ్యమై సనకాదిపరమయోగీంద్ర
సేవ్యమై సరిలేని చెలువంబు బూని
కిన్నరగంధర్వగీర్వాణయక్ష
పన్నగచారణప్రముఖు లెల్లపుడు
బహువైఖరులు మించ పడఁతుల గూడి
విహరించు మణిమయద్వీపముల్ గలిగి
కుటిలతుంగతరంగఘుమఘుమారావ
పటలిచే మీరు నీపాలమున్నీరు
ఫంటులజవరాలి బటువుము త్తియపు

గంటలమొలనూలికరణి రాణించి
చూడ్కికి కడు నింపుసొంపు ఘటింపు
వేడ్క గన్గొంటిరే వేలుపులార!
గరిమ నయ్యమృతంబు గై కొన బూని
సరిలేని యిమ్మహాజలరాశి డాసి
మన మందఱము గూడి మధియింత మిపుడె
మనమందరము డెందు మనసు రంజిల్ల.

వ. ఈ చందంబున చిందంబుదాలుపు వేలుపు మందలింప నానందంబు గందళింప కొందఱు సురాసురవీరు లమందరయంబున మందరనగంబు జేర వచ్చి రట యెటువలెను.

దరువు – శంకరాభరణం – ఆది.

అసురులు దివిజులు అట్టహాసములు సేయుచు
మసలుచు జేరి రామందరనగము

వ. ఈ రీతి జేరి వార లుల్లంబు రంజిల్ల నల్ల ధరాధరంబు పెల్లగించుక్రమం బెటువలెను.

దరువు.

ఏలల్లో! గోపాల!
మందర మెత్తర గోపాల! ఓరి!
ముందర హత్తర గోపాల! 1

ఎంత గనమురా గోపాల! ఈ
వింత[1]నగమురా గోపాల! 2

చేతుల నానర గోపాల!
జాతులు మానర గోపాల! 3

---

1. గనము

జరిగి పోకురా గోపాల ! ఇది
ఒరగనీకురా గోపాల ! 4

వ. (ఇక్కడ వాఁకఁ డాడే మాట):—ఓరె ! ఓరె ! పెల్లగిలెరా పెల్లగిలెరా ఓరి ! వస్తుందిరా ! వస్తుందిరా !!

దరువు.

నన్నులు వేయర గోపాల !
నన్నిటు డాయర గోపాల ! 5

సరసుకా గదరా గోపాల ! దీని
సరసకె పదరా గోపాల ! 6

చాల గొప్పరా గోపాల ! యీ
మూల దిప్పరా గోపాల ! 7

కడలికి జేర్పర గోపాల ! నా
బడలికి దీర్పర గోపాల ! 8

వ. ఇవ్విధంబున పెల్లగించిన యల్ల ధరాధరం బసురవిసర సహితంబుగా సురప్రకరంబు సుకరంబుగా దెచ్చిన క్రమం బెటువలెను.

దరువు - కేదార - అట.

మందర శైలంబు మహిమచే గైకొని
కొందఱు బృందారకులు దెచ్చి రపుడు.

వ. ఆ సమయంబున వాసుదేవుండు దలంప వాసుకి తన నిలయంబు వెడలి ప్రళయకాలానలజ్వాలాభీలవిషదంష్ట్రాకరాళవదనుండై యచ్చటికి వచ్చె నట యెటువలెను.

దరువు - రేవగుప్తి - ఆది.

ఘోరవిషధారలు గురియు కుటిలములౌ కోరలతో
వారిజాక్షుని చెంతకు వాసుకి వచ్చె.

వ. అవ్విధంబున వచ్చిన యవ్వాసుకినిం జూచి సురాసుర వరులు బెదరి పటాపంచలై పారి రట యెటువలెను.

బ్రహ్మ మాట :- ఓయి! సురాసురలార! బెదరక వాసు
కిని దెచ్చి తరితాడుగా వావణించరోయి!

—: దేవతలున్ను రాక్షసులున్ను ఆడుకొనేమాటలు :—

ఒకఁడు :- ఓసామి! దీని విసానకు దప్పిగద మాక
మృతము గావలె మే మటు రా వెఱతుము
పోరయా!

మరొకరు :- ఓరి! యిదెంత పాముర అప్పా! చేర వెఱ
పౌచున్నదిరా, కిచ్చమ్మ దీనిచేత కరపించ
పిలిపించె నేమో! మనముల.

మరొకరు :- ఓరి! కిచ్చమ్మకు మంత్రం కద్దురా కాఁగానే
వాఁడు యేవేళా పాముమీఁదనే పడు
కున్నాఁడు. వానికి భయం లేదు.

మరొకరు :- ఆమంత్రం బొమ్మదేవరా నేర్చుకొన్నాఁ
డేమో! కాఁగా భయం లేక దగ్గఱనే
వున్నాఁడు.

మరొకరు :- ఓరి! నాకున్ను పాముమంత్రం వచ్చురా
యిదుగో పట్టుకవస్తునాను చూడు.

వ. : అని పడెను.

మరొకఁడు :— ఓరి! ఆపడ్డవాణ్ణి లేవనెత్తరా లేవనెత్తరా.

బ్రహ్మ మాట :—ఓయి! సురాసురలార! యీపాముననేము తడకట్టినారము మీరు వెఱవకరారోయి!

—: రాక్షసులున్ను దేవతలున్ను ఆడుకొనేమాటలు :—

ఒకఁడు :- ఓరి! యింతమంత్రవాది కొడకవు ఆపామువద్దికి చేరు చూతాం దూరాన నుండి సుద్దులు చెప్పేవు.

మరొకఁడు :- ఓరి! యిదంతెవట్టున్ను యింద్రుంను చేసేవగలు, వుసురుగలిగితే వుప్పమ్ముక బ్రతుకవచ్చును పద పదంద్రా.

బ్రహ్మ :- ఝుడియకు రోయి! నమ్మి రారోయి!

మరొకఁడు :- అయితే చూతాం రారోయి!

వ. ఆ సమయంబున నా సరోజాక్షుండు తనచెంగట మొక్కి నిలిచిన భుజంగపుంగవునిం జూచి యే మనుచున్నాఁడు.

స్వామి మాట :- ఓయి! వాసుకి యీ సముద్రమథనంబునకు నీవు తరిత్రాడుగా నిలవవోయి!

వాసుకిమాట :- ఓస్వామి! ఆలాగే కానీవయ్యా!

వ. అవ్వేళ కవ్వంపుఁగొండ నాసుధాజలనిధానంబులోన నానించి, కాకోదరలోకాధిపతిని నత్తరిత్రాడుగా హావణించి జత్తాయితంబై శూరు లగు దేవదానవవీరులు పొంక్షంబుగా నిరువంకల తీరుగా బారుగా నిల్చి రంగదుత్తుంగ

తరంగసంఘుఘుమంఘుమ ఘోషావిశేషంబుచే దిక్కులు బిక్కటిల్ల మకరనికరంబులు సుడివడ మచ్ఛ కచ్ఛపం బులు తడబడ మతంగజంబులు గొట్టుబడ భుజంగమంబులు మెట్టుబడ కల్లోలంబులు హల్లకల్లోలంబులై ఘూర్ణిల్ల నమ్మహాంబుధి మథించి రట యెటువలెను.

పదము.

శ్రీరాజగోపాల! చిత్తగింపు మీవేళ
గారవంబున చాల కరుణింపు మాపాల
యేలేలో యేలేలో అయ్యా! యేలేలో యేలేలో
బల మొసఁగి పలుమారు పనిగొంటి రా మీరు
చెలువొందు దయమీరు చెలువమన్నారు!
సంపంగిమన్న! సరసప్రసన్న!
సొంపొందుచున్న సుగుణసంపన్న!

దేవతల మాట :- ఓరె! ఓరె! మందరపర్వతం ఒరిగెరా!
ఒరిగెరా!!

మరొకరి మాట :- ఓరి! చెలువమన్నఁడు నిలువనెత్తెరా
నిల్చెరా! నిల్చెరా!!

వ. ఇవ్విధంబున మథియించు సమయంబున మందరధరాధ రంబు క్రిందుపడ గోపాలుండు కూర్మరూపంబు వహించి యద్ధరణీధరంబుద్ధరించి సురాసురసమూహంబునకు వాసుకి దేహంబునకు తానే బలంబు ప్రబలంబు గావించుకతన నప్పుడు కోలాహలంబుమీర జనించు హాలాహలంబు భద్రుం డగు రుద్రుండు కబళించె గనక, ఆవెనక పారి జాతాదినిస్తులవస్తుజాతంబు లాపయఃపయోధిగర్భంబు నుండి యావిర్భవించె నట యెటువలెను.

దరువు - కురంజి - రూపకం.

చెలిమావు చౌదంతి వేలుపుటావు
కలువలచెలికాడు కల్పతరువులు
తలఁపుమానిక మమృతకలశంబు కౌస్తుభము
జలరాశిలోనుండి జనియించి వచ్చె.

వ. ఆ సమయంబున నాసుధాజలనిధానంబునుండి శ్రీవి కన
కాబ్జదేవి యవతరించె నట యెటువలెను.

ద్వి. పొంగెడు నల సుధాంభోనిధానమున
రంగదుత్తుంగతరంగమధ్యమున
కనకారవిందంపు గర్భగోళమున
జనియించి దివ్యతేజంబున మించి
నిద్దంపుసవరాలు నీలంపురాలు
పొద్దుకూతురిజాలు పోనాడజాలు
జగజంపునిడువాలు జడముడికీలు
సొగసుగల్గిన మేలుచూపుడిల్లాలు
పచ్చపైకపుపంట భక్తులయింట
నిచ్చలు కడకంట నిగుడించు దంట
దిగ్గజంబులబారు దెచ్చుబంగారు
నిగ్గుబిందెలజారు నీరాడగోరు
చిగురాకుఁబోణి యాజీనికడాణి
నిగరంపు జిగిమేని నెరదొరసాని
మొలకనవ్వులజోటి ముదితల మేటి
కలికిపల్కులయింతి కమ్మపూబంతి
చిలుకరాతుకటారి చికిలిమిటారి
మెలజవ్వనపుచాన యిభరాజయాన

వలపులదీవి సంపంగి నెత్తావి
చెలువంబు గలకొమ్మ చెంగమ్మ యపుడు
కాంచనాంభోజముల్ కరముల మెఱయ
మించు బంగరుచాయ మేనిడాల్ నెరయ
సకలభూషావిశేషము లింపు నింప
చికిలికస్తురిబొట్టు చెలువు రాణింప
నచ్చెరు వంది సురాసురల్ జూడ
నచ్చరచెలులతో నావిర్భవించె.

వ. ఈ విధంబున నావిర్భవించిన యాబాల యాపాలకడలి వెడలి యొయ్యారంబుమీర తత్తీరంబు జేర వచ్చె నట యెటువలెను.

దరువు - రేవగుప్తి - ఆది.

వేలుపు టొయ్యారులు వెయ్యారులు గొలువఁగా
బాలామణు లిద్దఱు చేలా గియ్యఁగా
పాలమున్నీటినుండి బయలుదేరి హాయిలుమీరి
జాళువానెత్తమ్మిజవరాలు వచ్చె.

వ. ఈలాగున వచ్చు పాలమున్నీటిరాచూలి దివ్యతేజో విశేషంబుచే కన్నులు మిరిమిట్లుగొన నశేషసురాసుర బృందంబులు డెందంబుల నచ్చెరు వొంది నివ్వెరపాటు జెంది చూచుచున్నసమయంబున నల బృందారకసందోహంబుల నెంచక దైతేయవ్రాతంబు విలోకించక వచ్చి యచ్చెరువ నిర్వికారుండై మేరుధీరుండైయున్న చెండలంకారుని జగన్మోహనాకారంబు విలోకింపుచు తదేకాయత్త చిత్తయై యున్న యత్తరి యల కెందమ్మిబిత్తరిముందటఁ జేరి వందనంబు లొనర్చి యరవిందభవ పురందరాది బృందారకులు కానుకలు దెచ్చి పొడగని రట యెటువలెను.

దరువు - పూర్వి - ఆది.

పద్మాక్షి మాతల్లి యని పద్మభవుఁ డావేళ
పద్మమాలిక దెచ్చి పద్మకు నొసఁగె. 1

చెలికత్తెల మాటలు :- ఓ చెలువలమేలుబంతి ! నలువ
యిదె పరాకు !

దరువు.

భువనత్రయము నేలు పురుహూతుఁ డాయింతికి
నవరత్న సింహాసనము దెచ్చి యొసఁగె. 2

మాట :- ఓ చంద్రముఖి ! యింద్రుఁ డిదె పరాకు !

దరువు.

కెంపురాచాయల సొంపొందు ననలుండు
కెంపులతాళి యొసఁగె సంపదలచెలికి. 3

మాట :- కనకాబ్జవల్లి ! అనలుం డిదె పరాకు !

దరువు - బిలహరి - ఆది.

ఇనతనయుఁ డావేళ హేమాబ్జదేవికి
కనుపట్టు నీలాలకడియము లొసఁగె. 4

మాట :- ఓమానినీమణి ! భానునందనుఁ డిదె పరాకు !

దరువు.

రక్కసులమన్నీఁ డారక్తాబ్జవల్లికి
చెక్కడఁపుపచ్చల చేసరు లొసఁగె. 5

మాట : ఓ జక్కవగుబ్బెత ! రక్కసరా జిదె పరాకు !

దరువు - కేదారగౌళ - ఆది.

వరుణుఁ డేవేళ నయ్యరుణాబ్జదేవికి
సరిలేని ముత్తెలసరులు కానుకఁజేసె. 6

మాట :- ఓతరుణీమణి ! వరుణుం డిదె పరాకు !

దరువు.

గోమేధికపుపావలు గొంచు వచ్చి పవనుండు
హేమాబ్జదేవికి నిచ్చె నావేళ. 7

మాట :-కమ్మదమ్మికొమ్మ ! తెమ్మరదొర యిదె పరాకు !

దరువు - గౌడిపంతు - అట.

కిన్నరాధీశుఁ డాకిన్నరకంఠికి
యెన్న దగు కనకాంబరము లెన్నైన నొసఁగె. 8

మాట :- ఓరాజముఖి ! రాజరా జిదె పరాకు !

దరువు.

ఇగురాకుఁబోణి కాయీశానుఁ డావేళ
మగరాలకమ్మలు మరి కానుకఁజేసె. 9

మాట :- ఓశరధికన్య ! ఈశానుఁ డిదె పరాకు !

వ. ఈచందంబున బృందారకబృందంబులచే పూజ లంది యానందంబున మించు కనకారవిందంపు టందంపు మచ్చె కంటి పచ్చవింటిదొర యరవిరితూపులమించు చూపుల కోపుల నాగోపాలదేవుని కనుంగొని పెనంగొనిన దట్టంపు వలపు రెట్టింప చొక్కపుమానతని చక్కదనంబునకు సొక్కి దక్కి మిక్కిలి యరుదంది మొలకచన్నుల గగుర్పాటు దిలకింప నెమ్మోము పులకింప చిఱుచెమ్మట దులకింప

నెంతయు సంతసించి తనచెంత నున్న కాంతనుం జూచి యే మనుచున్నది.

పదం - యదుకులకాంబోది - రూపకం.

శ్రీ లొందు రతనంపు చెంగోలువాఁడు
నీలంపుచాయల నెమ్మోనివాఁడు 1

ఈ జగన్మోహనాంగుఁ డెవ్వఁడు ? తెలుపవే
ఓజవ్వని ! యితని యూరేమి ? పేరేమి ? 2

కస్తూరి తిలకముచే గనుపట్టువాఁడు
కౌస్తుభ మురముపై గలిగినవాఁడు 3

పొలఁతి ! చుక్కలలోన పూర్ణచంద్రునిరీతి
నలవేల్పుదొరలలో నలరెడువాఁడు. 4

వ. అని పలుకు కలికిబోఁటియు చెలిమిబోఁటియు వెండియు తేట లగు మాట లాడి రట యెటువలెను.

సాంగత్యం - యదుకులకాంబోది - అట.

చెంగమ్మ :- చెలువైన శ్రీవత్సచిహ్నంబు నురముపై
గలిగి రాణించు యీఘనుఁ డెవ్వఁడె? చెలియ!

సఖి :- పొలఁతి ! మీనరూపముఁ బూని యానలువకు
తొలుబలుక్కు లొసఁగిన దొర యీతఁ డమ్మ ! 1

మధ్యమాది - అట.

చెంగ :- చెలఁగుచు రతనాలచెండు తనకరమున
నెలమితోఁ బూనిన యితఁ డెవ్వఁడె ? చెలియ !

సఖి :- వెలఁదిరో ! కూర్మమై వేల్పువజీరుల
వెలయించి మించిన విభుఁ డీతఁ డమ్మ ! 2

ముఖారి - అట.

చెంగ :- మోదమున చిఱునవ్వుమురువుచే మెఱసిన
యీ దేవాదిదేవుఁ డెవ్వఁడే? చెలియ!

సఖి :- ఆదివరహమై యసురేంద్రు ఖండించి
మేదినిఁ బ్రోచిన మేటి యితఁ డమ్మ! 3

బిలాహరి - ధ్రువం.

చెంగ :- మెఱుఁగుబంగరు శాలమేలివలెవాటుచే
హరువుగా విలశిల్లు నతఁ డెవ్వఁడే? చెలియ!

సఖి :- విరిఁబోణి! వింటివా నరసింహమూరియై
సురవైరి నణఁచిన శూరుఁ డితఁ డమ్మ! 4

ఆహరి - ఆది.

చెంగ :- కరుణారసము జిల్కు కడకంటిచూపుల
సరిలేక మెఱయు నీసరసుఁ డెవ్వఁడే? చెలియ!

సఖి :- తరుణిరో! వినవమ్మ తను గొల్చు వారికి
వరములు బాలించు గోపాలుఁ డితఁ డమ్మ! 5

వ. అని యయ్యిందుముఖితో సఖ మఱియు నే మనుచున్నది.

పదం - పంతువరాళి - ఆది.

తలిరుఁబోణి! దక్షిణద్వారకాపురిని
చెలువుమీరిన యట్టి చెలువమన్నఁ డితఁడే. 1

వెలఁదిరో! పదియాఱువేవురు జవ్వనులెలిఁగు వి:
వలపించి యేలుకొన్న వన్నెకాఁడే యితఁడమ్మ

కనకాంగి ! విజయరాఘవు నింట వెలయుచు
దినము దినము పూజ లందు దేవుఁడే యితఁడు. 3

వ. అనిన విని కమ్మదమ్మిదివాణంపుకొమ్మ తన నెమ్మ
నమ్మున సమ్మదంబు జెంది యమ్మగువతో మఱియు నే
మనుచున్నది.

పదం - కాంబోది - అట.

ప్రేమతో యీ విభుని బిగువుకౌఁగిట నుండు
భామిను లెటువంటి నోము నోచినారో ! 1

తొయ్యలి ! యీతని తొడలపై గూర్చుండు
వొయ్యారు లెంత తపము లొనరించినారో ! 2

జలజలోచన ! యితని జతగూడి యున్నట్టి
కలకంఠు లెంతటి భాగ్యము జేసినారో ! 3

మొలకనవ్వు గులుకు యితని ముద్దుమోము
బొడగన్న వలచి పైకొననట్టి వనితలు గలరె ! 4

ఓయమ్మ ! యీతని హెరాయిలు గనుంగొన్నపుడె
రాయబార మంపని రమణు లున్నారె ! 5

వ. ఆసమయంబున నాసరోజాక్షి రూపరేఖావిలాసంబులు
గనుంగొని సొక్కి యనంగునికి జిక్కి యాచక్కనిమన్నారు
తనమనంబున నేమని వితర్కించుచున్నాఁడు.

—: స్వామి అమ్మవారిని జూచేది :—

అవురౌర ! యీసతి యందచందములు
వివరింప నెందును విని కని యెఱుఁగ
తొలఁగక నిలిచిన తొలుకరిమెఱుపు
వలె మిటారించె నీ వనితాలలామ

ఈ విలాసంబులు నీరూపురేఖ
లీవికాసంబు లేయింతికి లేదు
తలఁపంగ నిటువంటి తలిరాకుఁబోణి
గలయుటకన్న భాగ్యము వేరె కలదె !
ముద్దుగా నీభామ ముచ్చటలాడి
పొద్దు బుచ్చుటకన్న పుణ్యంబు గలదె !
తొడలపై జేరి యీ తొయ్యలి నన్ను
తడబాటుమాటల తమిరేఁచు టెపుడొ ?
ఉదుటు సిబ్బపుగుబ్బ లురమెల్ల నిండ
కదిసి యెప్పుడు దీని కౌఁగిట జేర్తు ?
నామనోరథము లెన్నడు నెఱవేఱు !
కోమలి నన్నను గూర్చు వారెవరు ?

వ. అని యూహించి మోహించి చిత్తజగురుఁ డత్తరి యాబి త్తరిపై హత్తిన చిత్తంబుతో చెలఁగు నవ్వేళ పాల మున్నీటిమన్నీఁడు తనముద్దుకన్నియ యగు చెంగమ్మ చెంగటికి కెంగేల నొక బంగారుకమ్మనెత్తమ్మిపూదండ బూని వేదండయానలతో నచ్చటికి వచ్చె నట యెటు వలెను.

దరువు - శంకరాభరణం - ఆది.

ఇరువంక నదు లెల్ల యింతులై కొలువఁగా
సరిలేని రత్నభూషణములు మెఱయ
మురువుమీరఁగ పాలమున్నీటిమన్నీఁడు
అరుణాబ్జనాయిక సరస జేర వచ్చె.

వ. ఈ చందంబున నిజమందిరంబు వెడలివచ్చి యాకడలిరాజు చాతురిమీరనాతరి తనకూఁతురి నాదరించి యసమ కుసుమమాలిక యా బాలిక కేలి కొసఁగి యే మను చున్నాఁడు.

పదం - శ్రీరాగం - ఝంపతాళం.

రావమ్మ ! ముద్దుబట్టి రత్నాబ్జవల్లి ! 1
తోడికన్నియల గూడి యాడుదువు గాని
యీడ నొంటి నుండ నేల ! యింటికి రావమ్మ. 2
చెలులు నీవు బొమ్మపెండ్లి సేయుదువు గాని
చెలఁగు నీబంగరుమేడ చేర రావమ్మ ! 3

వ. అని పలికి యాజలధిరాజు తన తనయ యగు కనకాబ్జ దేవిని శీవిని దోడ్కొని వేడ్కమీర నిజమందిరంబు జేర నట యేటువలెను.

దరువు - గుమ్మకాంబోది - ఆది.

మున్నిటిమన్నీఁడు తనముద్దుబట్టినిఁ దోడ్కొని
చెన్నుమీర తననగరు జేరె నావేళ.

వ. ఇవ్విధంబున నవ్వనధిరాజు దోడ్కొనిరా నెంతయు వేడ్కతో నంత హేమాబ్జనాయికాకాంత నిజాంతః పురంబు ప్రవేశించి రత్నాకరుఁ డొసంగిన రత్నసింహాస నంబున చెలులు దాను చెలఁగుచు నుండె, ననంతరకథా సంవిధానం బెటువలెను.

వ. ఆ సమయంబున నాసుధారసంబునకై సురాసురవీరులు భుజగర్వదుర్వారులై మట్టుమీరి యట్టహాసంబులు సేయుచు రోసంబున డాయుచు ప్రాసంబులు జేపట్టుచు

మీానసంబులు వడివెట్టుచు కరవాలమ్ములు బెఱుకుచు కదిసిన వారిపై నుఱుకుచు విజృంభించి ప్రళయకాలాంభోధర గంభీరస్వరంబున గర్జింపుచు తర్జింపుచు రోష ద్వేషంబులు నెరయ నన్యోన్యభాషావిశేషంబులు మెఱయించి రట వొటువలెను.

—: రాక్షసుల మాటలు :—

రాక్షసుడు – నికుంభుండు :– ఓరి జంబారి! అమృతకుంభంబేల కేల నంటేవు? యీాసంరంభంబులు నాముందఱనా!

ఇంద్రుండు :– ఓరి నికుంభ! యెన్ని డంభంబులు జేసెవు నాదంభోళి నెఱుంగవా!

రాక్షసుడు – తారకుఁడు :– ఓరి యగ్గి! సిగ్గులేక యెన్ని పగ్గెల బొయ్యేవు నిలు నిలువరా!

అగ్ని :– ఓరి తారకా! మేరమీారక వూరకే నోరు మూాయరా.

రాక్షసుఁడు – శంబరుఁడు :– ఓరి దండధర! యీా చండితనంబు లటుండనీరా!

యముఁడు :– ఓరి శంబర! నీ యాడంబరంబుల కట్టిపెట్టరా!

రాక్షసుఁడు – సుమాలి :– ఓరి నైరృత! గొట్టెవలె యేల వెఱ్ఱికూఁతలు కూశేవురా?

నైరృతి :–ఓరి సుమాలి! బైసిమాలి యేమి గొణఁగేవురా!

రాక్షసుఁడు - బాణుండు :- ఓరిపాశి ! గాశిపడక తీసి
పోరా !

వరుణుండు :- ఓరిబాణ ! నీదుత్రాణ నే నెఱుఁగనా !
నాదుబాణంబుల పాలుగాక తొలఁగిపోరా !

రాక్షసుఁడు - హేతి :- ఓరి పవమాన ! అవమానపడక
యడఁకువతో నుండరా !

వాయువు :- ఓరి హేతి ! నాచేతిహేతి నెఱుఁగవేరా !

రాక్షసుఁడు :- దుందుభి :- ఓరి కుబేర ! నీకు బెరజంపు
మాట లేలరా ?

కుబేరుండు :-ఓరి దుందుభి ! యిందు నీతలకిందు జెల్లునా !

రాక్షసుఁడు - కాలనేమి :- ఓరి యీశాన ! యీశానలో
దగలక నీ దేశానకే పోరా !

ఈశానుండు :- ఓరి కాలనేమి ! యీవేళ నేమి వదరేవు ?
నా శూలంబుపాలు గాక తొలఁగి పోరా !

వ. ఈదారి యా దేవదానవవీరభటులు లారభటులు మీర సముద్భటులై వీరసంవాదం బొనర్చి యీరసంబున సుధారసంబునకై తారసంబై బారు సంఘటించి ఘోర సంగరం బొనరించి రట యెటువలెను.

దరువు - శంకరాభరణం - ఆది.

అమృతముకొఱకై యమరులు నసురలు
సమర మొనర్చిరి సంభ్రమ మమర.

వ. ఈ క్రమంబున విక్రమంబున మీరి సురాసురచక్రంబు
లొండొకటి నాక్రమించు సమయంబున సమరవరనిక

రంబుల నిరాకరించి యఖర్వబాహు గర్వదుర్వారులై
సుధారసంబు హరించ నెంచు నసురవీరుల పంచాస్త్ర
జనకుండు వంచింప దలఁచినక్రమం బెటువలెను.

—: మోహినివచ్చెను :—

ద్వి. ఆసమయంబున నల మన్ననారు
వాసవముఖుల బ్రోవఁగ మది నెంచి
సరిలేని తనమేనిచాయను మించు
నెరికప్పుకీల్గొప్పునీటు మీరంగ
తనజేతి శార్ఙంబుదారి నెంతయును
గనుపట్టు నందంపు కనుబొమల్ మెఱయ
తనదైన ప్రథమావతారంబులీల
గనుపించు నిడువాలు కనుదోయి చెలఁగ
సతతంబు తా దాల్చు సంపంగిమొగ్గ
వితమున నాసిక విలసిల్లుచుండ
సొగసైన తనదు కౌస్తుభమణికరణి
జిగిమించు కెమ్మోవిచెలువు రాణింప
పరికింప తననాభిపద్మంబురీతి
మురువైన ముద్దునెమ్మోము జెన్నొంద
భావింప తనచేతిపాంచజన్యంబు
కైవడి కంఠంబు కడు మిటారింప
తనవైజయంతికాదామం బనంగ
నొనరెడు భుజలతాయుగ మింపు నింప
జగతి తా దాల్చిన శైలరాజముల
తగిది నబ్బురపు శిబ్బపుగుబ్బ లమర

ననువొంద తననృసింహాకృతి లీల
గనజేయు సన్నంపుకొను రాజిల్ల
తిరముగ తానున్న తెలిదీవిశీవి
గరిమ ప్రకాసించు కటిచక్ర మమర
తనదైన కూర్మావతారంబుదారి
మినుకులు వెదజల్లు మీఁగాళ్లు నలర
తనదు చిహ్నములెల్ల తనయంగములనె
గనుపట్ట మోహినీకాంతరైు నిలిచె.

వ. ఇత్తెఱంగున జెలంగి నయ్యంగనామణి కారుమొయిలు మఱుఁగు దొఱంగు సొఱంగు తెఱంగున రంగు దుఱంగ లింపంగా నఱమావిమోవిచందురగావిశీవి గమ్మ బొమ్మంచుకెమ్మోవిపై చిఱునవ్వు చెంగలింపంగా నిరుల దెరల విభాళించు కురులపొరల గుబాళించు విరులసరుల బిసాళించు నెరసామకప్పు కీల్గొప్పు మిటారింపంగా తన రువారంబు లచ్చరమచ్చకంటుల దుటారింపంగా నాజగ న్మోహిని వచ్చె నట యెటువలెను.

దరువు - కాంబోది - ఆది.

మురిపెంపు సిగ్గుతోను ముద్దునెన్నడలతో
మెఱుఁగు వాలుచూపుతో మేలిసొగసుతో
చిఱునవ్వు నెమ్మోముతో జిలిబిలి పలుకులతో
మురవైరి యపుడు జగన్మోహినిరైు వచ్చె.

వ. ఇవ్విధంబున వచ్చి కమ్మదమ్మిదోదుమ్మిమొమ్మొకాని సమ్మోహనాస్త్రంబుచందంబున నందంబు మీరి యావంచనాకాంచనామోద యామోదభరంబు మించ తనయంచ నున్న మించుఁబోణితో నే మనుచున్నది.

పదం - కాంబోది - ఝంపతాళం.

ఇది యేమిః వింతయో ! యిపుడు
సుదతిరో ! నామదిని సోద్య మయ్యేని. 1

వెలఁదిరో ! వీర లెవ్వారో ? వీరు
కలహింపుచున్నట్టి కారణ మదేమో ? 2

ఓరమణి ! వీరి జగడములు
వారింపఁగా నేర్చువార లెవ్వారో ! 3

వ. అని పలుకు మఃణిమాయల నటకలత్తైతో నల కుటిల కుంతల యే మనుచున్నది,

పదం - మధ్యమాది - ఆది.

వెలఁది ! దేవదానవవీరులే వీరు
కలహించెద రమృతముఁ గైకొనఁ బూని. 1

చెలరేఁగి రక్కసులు జేజేల నదలించి
యల సుధ తాము జేకొనఁ దలఁచియున్నారు.

వ. అనిన విని యావన్నెలాఁడి యాకన్నులకలికితో నే మను చున్నది.

పదం - కాంబోది - అట.

పందెము గద్దా ఓ చెలియ ! పందెము గద్దా !
అందచందములచే నసురుల నెలయించి
విందుసేతు నమృతము వేల్పుల కెల్ల. 1

నీవే మెచ్చేవు ఓ చెలియ ! నీవే మెచ్చేవు
కావరంబున మించు కడిఁదిరక్కసుల
భావముల్ గరఁగింతు హావభావముల. 2

వ. ఈరీతి బలికి యా నారీతిలకంబు తన యందచందంబులకు సాక్షి డెందంబున నాశ్చర్యంబు నొందు సురాసురబృందంబుల వివాదంబు నిజకరారవిందంబున వారించి మోదంబున వారితో నే మనుచున్నది.

పదం - కేదారగౌళ - ఆది.

రారోయి ! వేలుపులార ! రక్కసులార !
యీరీతి పోరాడ మేరగాదు మీకు. 1

ఇందతికే నమృతంపువిందు గావింతు
నిందుకై సందియమేల ? యే వింతదాననా ! 2

మనసున నిటువంటి మచ్చరంబులు మాని
యనురక్తి మీరందఱొకకై యాదరింపరాదా. 3

వ. అని యొడంబడఁ బలికి యాకలికిచిలుకలకొలికి తొలువేలుపుల నల వేలుపుల నిండువేడుక రెండుతెఱఁగుల నేర్పమర నేర్పరించి యసురవీరుల తనవిలాసంబుల నెలయించి సురవరులకు సుధారసం బొసంగి వెలయించె నట యెటువలెను.

దరువు - కల్యాణి - రూపకం.

రమణీమణి దనుజుల భ్రమయించి యావేళ
నమరవీరుల కెల్ల నమృతము నొసఁగె

వ. ఇవ్విధంబున నవ్యాధూరూపంబునఁ జూపట్టి పరిహాసదరహాసవిలాసంబులదైతేయనికాయంబు నెలయించి సొలయించి సారసుధారసధారల బృందారకబృందంబులకు విందు గావించి వారికి పారిజాతాదినమస్తవస్తుజాతంబు లొసంగి

తాను నిజరూపంబు బూని నిస్తులప్రభంబగు కౌస్తు భంబు కరంబువేడుఁక నురంబున హత్తించి యుత్తరి మత్తులగు దైత్యవీరుల నవక్రచక్రధారల నుక్కడంచి యల వాసుదేవుఁ డాసరోజభవవాసవాదుల నిజనివా సంబులకుఁ బంచి తాను నక్షణంబె దక్షిణద్వారకానగర వరంబు జేరి మంతనంబున నంతఃపురంబునఁ జెలువల గూడి కొలువై యుండె ననంతరకథాసంవిధానం బెటువలెను.

వ. అంత హేమాబ్జనాయికాకాంత యేకాంతంబుగా నిజాంతః పురంబునం దొక యిందుకాంతవేదికాంతరంబున నందంపు గందంపు మానిదండ నుండి యానందనందనుని యంద చందంబులు డెందంబున దలంపుచు నిలుపరాని వలపు పొలుపునఁ దాళజాలక జాల కలఁగి యొక నీలనీలాలకతో తనముచ్చట విచ్చనవిడిగాఁ దెలిపె నట యెటువలెను.

పదం – కాంబోది – ఆది.

మన్నారుసామిపై మాటికి నే నేల? మరులుకొంటినే
చెలియ!
ఎన్నరాని ప్రేమ వాని చక్కదన మే నేల? కనుఁ
గొంటినే! 1

కనుఁగొన్నయప్పటనుండి నానెమ్మన కాఁక హెచ్చెనే
చెలియ!
ననవిల్తుఁ డంతలో చాలా మచ్చరించి నాపై దాడి
వచ్చెనే. 2

హృదయేశుఁ గలయక యింతిరో! యీరేయి యెట్లా?
తెల్లవాఱునే చెలియ!
ముదిత! వానిమోవి తేనె లానక యెట్లా? ముచ్చట
లీడేరునే. 3

వ. అని వెండియు నల నిండుజవ్వని తనదండ నున్న వేదండ గమనతో నే మనుచున్నది.

పదం - భైరవి - ఆది.

మగువరో! వినవమ్మ మన్నారు దేవుండు
మన సిచ్చి యెన్నఁడు మాటలాడునో!
చిగురుఁబోణి! వినవె యాశృంగారనాయకుని
చిత్తము రా సేవసేయు టెన్నఁడో! 1

చెలువ! మన్నని జేరి చెక్కిలి గోర జీరి
కులుకుగుబ్బల రొమ్ము గుమ్ము టెన్నఁడో!
చలువవెన్నెలబైట సంపంగిపూదోఁట
చెలి! వాని కౌఁగిట చెలఁగు టెన్నఁడో! 2

కలకంఠి! మన్నారు గారవంబున నన్ను
కళ లంటి సమరతులఁ గలయు టెన్నఁడో!
కలికి! వాని యురమున కౌస్తుభంపు టుయ్యాలపై
నెలకొని యుపరతుల నలయించు టెన్నఁడో! 3

పల్లవి.

తాళజాలనే వానిపై మేలుదాననే
బాల! రమ్మని నన్ను బంగారుమన్నారు
చాల లాలించి న న్నేలు టెన్నఁడో! 4

వ. అనిన విని యాకాంతను జూచి చెంత నున్న యంతరంగపు చెలు లామెఱుంగుఁబోణితో నే మనుచున్నారు.

పదం.

కలికిరో! నీవిట్లా కలఁగేది న్యాయమా
కులకాంతలకు నిది కొదవ గాదటవే! 1

చెలియరో ! నిన్నటి చిన్న దానవు నీవు
భళి భళి ! నీకింత వలపేల ? నమ్మ ! 2

వ. అన విని హేమాబ్జవల్లి యాభామలతో నేమనుచున్నది.

పదం - ఘంటారవం - ఝుంపతాళం.

ఓవెలఁది ! నావలపు న న్నింత సేయఁగా
నొకరి దూరఁగ నేలనే ?
నావిభుఁడు రాకున్న హితు లెల్ల నహితులై
న న్నేఁచెదరు కంటివా. 1

ఇన్నాళ్లు తన కిరవైన యీకమ్మదామరలే
కన్నులవిల్తు తూపులై న న్నలయించెనే
ఎన్న నాతోఁబుట్టువౌ యీ చందమామయే
వెన్నెలకాఁకలు వెదచల్లెఁ గదవే ! 2

వ. అనిన విని యొక లతాంగి భంగ్యంతరంబునఁ జెంగమలా
కాంతవంత దీర్చు నుపాయంబుఁ జింతించి యే మనుచున్నది.

—: చెలికత్తె చదివే పద్యం :—

సీ. కోమలి ! వింటివా గుజ్జుగొజ్జఁగి పొదల్
చిన్ని మొగ్గలచేత చెన్నుమీరె
మగవరో ! వింటివా మకరందరసముల
తేలి యాడే నమ్మ ! తేంటిగములు
సుదతిరో ! వింటివా సురపొన్నగున్నల
కోయిలల్ గానంబు సేయఁదొణఁగె
బిత్తరి ! వింటివా పేరెముల్ వారిని
గండంపు గుబ్బలిగాడ్పు రేఁడు

ఆ. వె. చిగురుఁబోణి ! యల్ల శృంగారవన మున్న
చెలువ మెన్నఁ దరమె నలువ కైన
వేడ్క నచట మనము విహరించి వత్తము
గాని వేగ రమ్ము కలికి ! లెమ్ము.

వ. ఇవ్విధంబునఁ బలికిన యవ్వధూరత్నంబు యత్నంబున దోడ్కొని రా వేడ్కతో నల కెందమ్మిజవరాలు ముందఱ వెనక కొందఱు చెలువలు గొలువ తెమ్మెర లెదురుకొని పొదరిండ్ల పూవులతావుల కై కానుక లొసంగ శృంగార వనంబుఁ జేర వచ్చెనట యెటువలెను.

పదం - తోడి - ఆది.

కలకంఠు లిద్దఱు కై దండ లీయఁగా
నెలదోఁటకు వచ్చె హేమాబ్జవల్లి

వ. ఇవ్విధంబున నవ్వనిం జేరు జవ్వనిం జూచి మచ్చికతో నెచ్చెలు లే మనుచున్నారు.

పదం - సావేరి - ఆది.

అంగన ! కనుఁగొంటె ఔరౌర ! నేఁడీ
శృంగారవన మెంత చెలువు రాణించె ! 1

పొగడఁగావచ్చు నీపొగడలపెంపు
సొగసాయె కురువేరు జొంపముసొంపు
బుగులుకొను సంపంగిపొంత నె కెంపు
జగిమించె నదె మావిచిగురుల గుంపు. 2

గరిమె మిటారించె గాడ్పుచే మెదలు
సురపొన్న వలగొన్న సొగసుతుమ్మెదలు
అరుదాయె కంతుని యమ్ములపొదలు
మారువున పొదలు నీయలరులపొదలు. 3

వ. ఆసమయంబున నొక సఖియు నయ్యిందుముఖియు సరసంపు మాట లాడి రట యెటువలెను.

పదం - కాంబోది - అట.

సఖ :- తెలుప ! నేఁడిచ్చోట తిలకవిలాసంబు
హరువొందె కనుఁగొంటివా చెంగమ్మ !
చెంగమ్మ :- తిరమైన యదువంశతిలకవిలాసంబె
నిరతముఁ జూచెదనే ఓచెలియ ! 1

సఖ :- ప్రతిలేక రాణించు పాటలవైఖరి
జతమించె చూడవమ్మా చెంగమ్మ !
చెంగమ్మ :- పతివేణునాదంపు పాటలవైఖరి
నితపుగా విన జూతునే ఓ చెలియ ! 2

సఖ :- వనజాక్షి ! ఇచ్చటి వకుళాతిశయ మెల్ల
కనుఁగొన గదవమ్మా చెంగమ్మ !
చెంగమ్మ :- వనితరో ! అల మాధవకులాతిశయ మెల్ల
కనుఁగొన మన సయ్యేనే ఓ చెలియ ! 3

సఖ :- ఇందీవరాక్షి ! ఈకుందవైభవము
పొందుగా కనుఁగొనవే చెంగమ్మ !
చెంగమ్మ :- అందముమీర ముకుందవైభవమే
ముందుగా కనుఁగొంటినే ఓ చెలియ ! 4

సఖ :- ఎనలేని వేడుక యీనవమాలికఁ
గనుఁగొని పొక్కేవేమే చెంగమ్మ !
చెంగమ్మ :- అనువుగా మొదలింటి యక్షరంబులు రెండు
వెనకముందుగా బల్కవే ఓ చెలియ ! 5

వ. ఆవేళ జాళువాతామరముద్దియ గద్దియముద్దియవద్ద నున్న ముద్దుగుమ్మ లమ్మగువకు ప్రొద్దుపోకగా ముద్దులసుద్దులు మెఱయ పుష్పాపచయంబు సల్పి రట నెటువలెను.

పదం - ఘంటారవం - రూపకం.

ఈమొల్ల పూబంతి యే మొల్ల మే యింతి !
ఆమల్లికై తేఁటిదా మల్లె బోఁటి ! 1

ఈపారిజాతమే యీపారి జూతమే
యేపెన్నఁదగు హత్తి యీపొన్న గుత్తి. 2

చిగురాకు చేఁబూని నగరాకు వేలేని
జగడాలు మాను మదె జగడాలుమాను. 3

భామ ! యీవిరవాది ప్రేమ నంటకు మిది
లేమా ! విలోకింపు లేమావిగుంపు. 4

వ. ఇత్తెఱంగున సమ్మోహనంగుఁబోణు లచ్చట ముచ్చటదీర పలుకుల దేలుచు, చిలుకల దోలుచు, పాటలు బాడుచు, బోఁటుల గూడుచు, పరువులు బారుచు, తరువులు జేరుచు, కొమ్మలు వంపుచు, రెమ్మలు ద్రుంపుచు, క్రేవల డాయుచు, పూవులు గోయుచు, చెలువల జీరుచు చలువలు గోరుచు, నివ్విధంబున విహరించుసమయంబున నంతంత కుపొంగెడు కంతుసంతాపంబున పరిశ్రాంతయై విభ్రాంతయై యున్న హేమాబ్జనాయికాకాంతచెంత జేరి యాచెలువలు చలువలు జేసి రట నెటువలెను.

దరువు - భైరవి - ఆది.

కన్నియకు మేలైన కపురంపుదిన్నెపై
సన్నజాజుల శయ్య సవరించె నొకతె. 1

కలికి గుబ్బలమీఁద కమ్మగందము నలఁది
యలరుల దుప్పటి పావడించె నొకతె. 2

జవ్వాని మైనిండ చలువపన్నీరు నించి
పువ్వుల సురఁటులు బూని విసరె నొకతె. 3

వ. ఈలాగున బాలామణు లొనర్చు చలువలచే కలువకంటి నలరువింటిరాయలమాయల విరాలిజాలి హెచ్చె గనక కనకాబ్జవల్లి యాకనకవనస్వామి తనకన్నుల గట్టినట్లున్న నతని పేరుకొని దూరుకొని యే మనుచున్నది.

పదం - కాంబోది - అట.

ఏలరా! చల మేలరా! చాలా వలచితి నీకు సంపంగిమన్న!
ఏలరా! చల మేలరా!
మదనుఁ డమ్ముల నేయ చేరి మత్తకోకిల కూయ
చెదరి రా నామనసు చెల్లఁబో నను నీవు
కదిసి కౌఁగిట జేర్చి గారవంబునను. 2

వెన్నెలకాఁక మించెరా నాచన్నులు పులకరించెర
వెన్నమైె నామనసు వేమారు కరగేని
కన్నడ సేయక కరుణమీరఁగా. 3

వ. ఈచందంబున కెందమ్మియింటివాలుగంటి యొంటిమై వెడవింటిరాయలమాయల దూలి విరాలిజాలి పడుచు పడుచుల పేర జీరక పరిమేళంబులు గోరక చిలుకలకు పలుకులు నేర్పక చెలులమాట చెవి జేర్పక కొనగోర చికిలికిన్నెర బలికించక కొమ్మల నాట్యమ్ములు విలోకించక పంతువగ పదాలు బాడక యింతులతో సరసంబు లాడక విన్న

బాటుతో వింతనీటుతో నున్న యావన్నెలాఁడి కడకు వేడుకతోడ రూపవతి యను ప్రోడనెచ్చెలి వచ్చె నట యెటువలెను.

దరువు - పంతువరాళి - అట.

పొంగుచు సంపంగిపూబంతి చేబూని
చెంగమ్మ చెంగటికి చెలియ వచ్చె నపుడు.

వ. ఇవ్విధంబున వచ్చిన యాయింతి దెచ్చిన పూబంతి మచ్చికతో కానుక యిచ్చి యా మున్నీటిమన్నీని చిన్నికన్నియ విరహంపు చిన్నెలు జూచి యా చెలియ తెలియ నడుగుచందంబున కాయించు సోదరి తనడెందంబు దాఁచి మంచలించు నందంబునకు వారికి పరస్పరవచనరచనలు నడచెనట యెటువలెను.

పదం - మధ్యమాది - అట.

రూపవతి :- మొలకనవ్వులాఁడి ! నీముద్దునెమ్మోముపై
కలికి ! చెమ్మట గ్రమ్మ కారణ మేమే ?

చెంగమ్మ :- చెలువల గూడి నే చెండుగోరింపంగ
చెలియ ! నానెమ్మోము చెమరించె నమ్మ ! 1

రూప :- నారీమణి ! యంచలకు నడకలు నేర్పక
వూరకె బడలి నీ వున్నావ దేమే ?

చెంగ :- కూరిమి చెలులతో గుజగుజలేకు లాడి
ఓ రమణి ! నే బడలియున్నా నమ్మ ! 2

రూప :- చల మేల తెల్పు నీ చక్కని నెమ్మేను
కలువకంటి ! యింత కందువాఱ నేలే ?

చెంగ :- ఎలదోఁట విహరింప నెండకాఁకలచేత
కలికిరో ! నామేను కందువాఱె నే. 3

వ. అనిన విని యారాజవదన రాజనాయికతో నే మను చున్నది.

—: రూపవతి చదివేది :—

ద్వి. జలజాక్షి ! నీవున్న చంద మిదేమి ?
భళి భళి ! మన సిచ్చి పలుక వదేమి ?
కన్నెల జీరవు కపురంపుపలుకు
దిన్నెలు జేరవు దిట్ట కోయిలల
పాడింప నొల్లవు పడఁతుల గూడి
క్రీడింప మళ్లవు కిలకిల మనుచు
నవ్వుచు గులుకవు ననుపుచిల్కలను
దువ్వుచు పలుకవు తొయ్యలుల్ బిలువ
మొగ మెత్తి చూడవు మోడితో నున్న
వగహత్తి పీడవు వదలిన కొప్పు
ఘటియింప నోపవు కలికి నెమ్మిలను
నటియింప జూపవు నను చేరదీసి
మాటలాడ వదేమి ? మాచెవి యాన
పాట బాడ వదేమి ? భద్రేభయాన
ఈ విన్నబాటేమి ? యిటు తల వంచి
నీ వున్న నీటేమి ? నిక్కంబు గాఁగ
నాతోడ నీదుడెందము దెల్ప వమ్మ !
నాతోడు దాఁచకే నాతోడునీడ
నెలఁతరో ! నావంటి నెనరైన చెలియ
కలుగంగ నీవింత కలఁగంగ నేల ?
ఇంతిరో ! నీతలఁ పెఱిఁగించి తేని
యెంతటి పనినైన నే నొనఁగూర్తు.

వ. అని పలికి యాబోటి యవ్వధూటివలపుపొలుపు తన తలంపులో నూహించి యామోహనాంగిపజ్జ జేరి లజ్జాభరం బుజ్జగించి బుజ్జగించి యే మనుచున్నది.

పదం - గుమ్మకాంబోది - అట.

మగువరో ! యిటు జూడవమ్మ ! యిక్కనైన నీ
మన సిచ్చి మాట లాడవమ్మ ! నీమదిలోని
నెగు లెల్ల దీర్పలేనా తగులై దానగానా. 1

రమ్మని చేపట్ట వే మమ్మ ? నే దెచ్చిన
కమ్మవిరులు జుట్ట వే మమ్మ ? ఔరార ! యీ
ముమ్మరమౌ కాఁక లేమి ? మోహంపు డాక లేమి ? 2

తలఁపు దెలుప వే మమ్మ ? చిన్ననాటి
చెలిమి యింత తలఁప వే మమ్మ !
నెలఁత ! యెంతకోర్కికైనా నేనె చేకూర్చుదాన. 3

వ. అనిన విని యెంతయు సంతసించి కొంత వంతదీరి యా కమలాంతఃపురకాంత యచ్చెలిని మెచ్చి యే మనుచున్నది.

—: అమ్మవారు చెలితో మాటాడే ద్విపద :—

ద్వి. లలితాంగి ! నీవింత లాలించి నపుడె
తలఁపు లీడేరె వంతయు దీరె నమ్మ !
నీకన్న నెనరైన నెచ్చెలు లెవరు ?
ఈకోర్కె జేకూర్ప నీవె నేర్పరివి
సుదతిరో ! నీవంటి చుట్టముల్ గలరె !
హృదయంబు దాఁచక నెఱిఁ గింతు వినుము
మున్నీటిచెంగట మొన్న మన్నారు
కన్నులపండువుగా గనుఁగొంటి

నతని జగన్మోహనాంగశృంగార
మతివరో ! కనుఁగొన్న యప్పటనుండి
వలఁపు రెట్టించఁగా వలరాజుచేతి
యలరులతూపుల నసురుసు రైతి
కాంతుని నన్నుఁ గూర్చి కలఁకలు దీర్చి
యింతిరో ! నాకోర్కు లీడేర్పవమ్మ !

వ. అనిన విని బోఁటి యాసంపద్వధూటితో నే మనుచున్నది.

పదం - సావేరి - ఆది.

ఔరౌర ! కొండంత కోరిక కోరితివి
యీరాయ బారంబు లెవ్వరిచే ? నమరు 1

మగవారు వలచిన మర్యాదై యుండు
మగువలు వలచిన మిగుల చౌకగాదా ! 2

పదియాఱు వేవురు పడఁతుల వలపించు
హృదయేశుపొందు నీ కేలాగు హత్తు. 3

చెలువమన్నరుసామి చెల్లఁబో మన కింత
సులభుఁడా యీకోరిక సుదతి ! చాలింపు. 4

ఓజవ్వని ! యిటువంటి యూహాలు జెల్లునా ?
రాజకన్నెల కిది రోజ గాదమ్మ ! 5

వ. అనిన విని కనకాబ్జవల్లి యాకనకాంగితో నే మనుచున్నది.

—: చెంగమ్మ చదివే పద్యం :—

ఉ. అక్కట ! నీవె నాపలుకు లాఱడిబెట్టిన యెట్టు లోర్తునే
చక్కెరవిల్తుడాకకును జందురుకాఁకకుఁ దాళనేర్తునే
మక్కువమీఱ నెట్లయిన మన్నరుసామిని నన్ను గూర్పవే
మొక్కెద నీకు నోచెలియ ! ముమ్మరమైన విరాలి దీర్పవే.

వ. అనిన విని యుల్లంబున రంజిల్లి యల్ల సఖీమణి యా భామను జూచి యే మనుచున్నది.

పదం – కేదారగౌళ – ఆది.

నియ్యుంద మీానజకు నే దెలియనైతి
తొయ్యలి ! నీవిభుని తోడి తెచ్చె నమ్మ ! 1
మంతనమున నాతో నీదు మనసు దెల్పఁగా
నింత మేలుదాన వని యిపుడు దెలిసె నమ్మ ! 2
చెలఁగి నీకోరిక చేరిక గావింతు
నెలఁత ! యీాయలఁత మాని నెమ్మది నుండవమ్మ ! 3

వ. ఇవ్విధంబున బలికి యాకలికి యవ్వానధిరాట్కన్య పను పున వేడ్కతో గ్రామారామనదీనదతటాకానేకమహారణ్య పుణ్యప్రదేశంబులు గడచి నడచి శుభనిమిత్తంబులకు చిత్తంబున నానందింపుచు ముందఱ వెనక సుందరదనలు గొందఱు దెచ్చు హెచ్చు కానికలు మానికపుతట్టల పట్టించు కొని యక్షణంబె దక్షిణద్వారకాపురంబునకు వచ్చె నట యెటువలెను.

దరువు – కల్యాణి – ఆది.

చెలులు గొందఱు కానుకల్ చేకొని వెంటరాగా
తలిరుఁబోణి దక్షిణద్వారక జేరె

వ. ఈరీతి జేరి యప్పు డాకప్పురగంధి యప్పురంబున విజయ రాఘువపట్టభద్రుండు గట్టించిన గుజరాతిజాతి కెంపు చెక్కడంపుపనుల మిటారించు నతిదిద్క్ప్రాకారంబులగు గోపురప్రాకారంబులు శ్రీవైష్ణవపుంగవగేహంబులు శృంగారవనసమూహంబులు హరిద్రానది మొదలుగా బొదలు ననేకతటాకంబులు ఘోటకమయమంటపానీకంబులు నాలో

కింపుచు సొంపొంది యా సంపంగిమన్నారు నగరివాకలి జేరి యామిటారి యచ్చట నున్న యవసరంపు మచ్చెకంటినిం జూచి మందరధరుని సమయంబు దెలుపు మని మంతలింప నాకాంత యిప్పు డేకాంతసమయ మని పరిహరింప నాడా రికి వారికి పరస్పరవచనరచనలు నడచె నట యెటువలెను.

పదం - ముఖారి - అట.

జలజాక్షి ! యీ వేళ సంపంగిమన్నారు
సమయ మేమి ? దెలుపవే
వెలఁదిరో ! పదియారువేవురు చెలులతో
విహరించువేళ గాదా. 1

భామరో ! మన్నారుసామితో నొకసారి
నామనవి వివరింపవే
కోమలి ! యల సత్యభామపొలయల్క దీర్చి
కూడియున్న వేళ గాదా ! 2

కన్నెరో ! నేవచ్చుకార్యము శౌరికి విన్నవింపఁగలవె
మన్నారుదాసుని మానసపూజల చెనొందువేళగాదా ! 3

వ. అనిన విని యప్పు డప్పడఁతి యొడఁబడఁ బలికిన పలుకు లంగీకరించి యంగజగురుని చెంగట జేరి యామదావళ గమన తదాగమన ప్రసంగం బెటింగించె నట యెటు వలెను.

ఎగ్గడికత్తె మాట :- ఓస్వామి ! పరాకు ! ఒక పడఁతి దేవరను పొడగన దలంచి కైకాను కలు జేకొని వాకిటను గాచియున్నది నీ సమ్ముఖమ్మున కాకొమ్మను రమ్మందునా !

స్వామి మాట :- అలాగే రమ్మనవే !

ఎగ్గడికత్తె మాట :- ఓ భామిని ! స్వామి బిలిచేని రావె.

వ. అనిన విని యాచిగురుఁబోణి నగధరుని నగరు ప్రవేసించి యచ్చట హెచ్చు లగు పచ్చలగచ్చుల నిచ్చలం బగు శాతకుంభ స్తంభసహస్రంబుల మించు విజయ రాఘవభూపాలమంటపరాజంబుచేరువ తేజంబువిూరుచు మేరుసమానంబై భానుకోటిప్రభాభాసమానం బగు స్వాయంభువ విమానంబున నందంపుగందంపుచప్పరంబున నొప్పు విూత్న నవరత్న సింహాసనంబున గూర్చుండి చెలువలతో గొలువున్న చెలువమన్నని సమ్ముఖమ్ము జేరి సమ్మదమ్మున మొక్కి తెచ్చిన కై కానుక లిచ్చి నిలిచిన యాచెలినిం బిలిచి యాదరించి యాదార యే మను చున్నాఁడు.

—: స్వామి చదివే పద్యం :—

క. ఎవ్వరు ? బోషింతురు నీ
వెవ్వరి తెగ యెచటనుండి యిటు వచ్చితి వీ
వెవ్వరు ? ని న్నిటు బంచిరి
అవ్విధ మెఱిఁగింపు మాకు నంతయు చెలియా !

వ. అనిన విని యాచెలువ యాచెలువ మన్ననితో నే మను చున్నది.

—: చెలికత్తె స్వామితో మాటాడే ద్విపద :—

ద్వి. అవధరింపుము దేవ ! అతులప్రభావ !
భువనరక్షణదక్ష ! పుండరీకాక్ష !
భోజకన్యాలోల ! పుణ్యసంశీల !
రాజద్గుణావాల ! రాజగోపాల !

మొన్న దేవరవారి మున్నీటిబరిని
గన్నులపండువుగాఁ జూచి సొక్కి
కన్నులవిలుకాని గాసికి జిక్కి
కన్నియలమిటారి కడలికుమారి
కాంతామతల్లి మాకనకాబ్జవల్లి
యంతరంగమున నీయందచందములె
యూహించి మోహించి యోర్వఁగారాని
మోహసాగరమున మునిఁగి తేలుచును
నిను దోడితెమ్మని నేఁడు మాయింతి
నను నిటు బంచె నోనలినాయతాక్ష !
మానసీమదన ! నామనవు లాలించి
యేను వచ్చినకార్య మీడేర్పవయ్య !

వ. అని పలికి యాకలికిచిలుకలకొలికి చెండలంకాగునితో
వెండియు నే మనుచున్నది.

పదం - ఘంటారవం - ఆది.

చక్కనివారిలో చక్కనిది మిగుల
చొక్కమౌ పలుకుల నిన్ను సొక్కించ నేర్చు. 1
వింతకవిత పొవణించు వీణె వాయించు
నెంతయు సరసురాలు యెల్లవిద్యలను. 2
అన్నిటా నెరజాణ యందచందములచే
వన్నెలాఁడిసాటి యెవరు మన్నారుదేవ ! 3

వ. అని యాచెలువ కలువచాయలచెలువరాయలతో
మఱియు నే మనుచున్నది,

పదం - కాంబోది - అట.

నీకే తగురా ముద్దుబాల
రాకేందువదన ! ఓరాజగోపాల ! 1

తేటైన విరిదేనె లొలుకు మిగుల
మాటలనీటుల మఱి ముద్దుగులుకు
మేటియౌా నాటపాటలకు నల్ల
ఆఁటదైనా లోనౌను ఆయింతివలకు. 2

ఉదుటుగుబ్బల వింతమురువు మా
ఒయ్యారికే తగు నెంతైన హరువు
పదపద్యములు చాల నేర్చు ఆ
భామను నీయురమునఁ బ్రేమను జేర్చు. 3

కామించి పిలిచెను నిన్ను జాణ
వేమారు సొక్కెను నిను జూచి మున్ను
స్వామి ! యోజవరాలి నేలు యింత
చల మేల సేసేవు మేలు మేలు. 4

వ. అని యావన్నెలాఁడి సన్నజాజినరాజిమన్నినింగన్న య్యతో మఱియు నేమని విన్నవింపుచున్నది.

—: చెలికత్తె చదివే పద్యం :—

సీ. ముద్దులుగులుకురా సుద్దులచిలుకరా
బంగారుతళుకురా పలికి చూడు
కమ్మపూబంతిరా కామునిదంతిరా
వలపులదొంతిరా యలమి చూడు
కలువనెత్తావిరా కపురంపు దీవిరా
తేనెలసోనరా యాని చూడు

మరుకేళిజాణరా మాటలజూటురా
వలపించ నేర్చురా పిలిచి చూడు

గీ. వనజనేత్రలమేటి మావనితసాటి
బోటి గలుగునె భువి నెరనీటులందు
నలరువిలుకాని కేళిని నలరులీల
బాల నేలుము రాజగోపాలదేవ !

వ. అని యామిటారి చిగురుకటారిరాయలఁగన్నయ్యతో
మఱియు నే మనుచున్నది.

పదం - యదుకులకాంబోది - ఆది.

వనితను నేలుకోరా వగ లేల నేసేవురా
ఎనలేని తమి నున్నదిరా యేమిరా సంపంగిమన్న ! 1

కన్నెప్రాయము నీకు జన్నెబట్టినదాని
కన్నవిసేయక కరుణమీరఁగా. 2

కురులు కూడనినాడె మరులుకొన్నదాని
సరుగ కౌఁగిట జేర్చి చక్కెరమోవి యాని. 3

వ. అనిన విని యాకనకవనస్వామి యాభామను జూచి యే
మనుచున్నాఁడు.

—: గోపాలస్వామి చదివే పద్యం :—

గీ. సుదతి ! యానాను మేమును జూచినార
మావధూమణి రూపరేఖావిలాస
మంగనరో ! నీవు వేఱె తెల్పంగవలదు
కలికికోరికఁ జేకూర్తుఁ గలఁకఁ దీర్తు -

గోపాలుని మాట :- ఓచెలియ! అలకలశాంబుధిచెంత నా
యింతిని జూచినప్పటనుండి కంతుని
బారికి జిక్కి యెంతయుఁ జింతిలు
చుండగా నాకోమను మమ్మును
గూర్చెద నని నీవు వచ్చిపలికితివి
గనుక నుల్లంబు రంజిల్లె నోభామ!
యిఁక మే మటు వచ్చు నుపాయం
బేమి? తెలుపుమా!

రూపవతి మాట :- ఓస్వామి! మాముస్నిటిమస్నినికి
విన్నవించి రేపెల్లి మిమ్ము స్వయం
వరంబునకు రప్పించేము, అప్పుడు
పరాకుసేయక దేవర యటు విచ్చేసి
మానెచ్చెలి నేలుకోవయ్యా! ఇందుకు
గురుతుగా మీ కరంబున నున్న
ముద్దుటుంగరంబుఁ బాంలిపవయ్యా!

స్వామి మాట :- ఓకుటిలకుంతల! అటువలనే వచ్చి మీ
నెచ్చెలిమనోరథంబుఁజేకూర్తు. అయ్యిం
గనకు నీ ముద్దుటుంగరం బొసంగవే.

వ. అని యాదరించి రతనాలసొమ్ములు దివ్యాంబరంబు లొసంగి
సొంపున సంపంగిగుంపుదివాణంపుజేజేవజీరుం డొసంగు
ముద్దుటుంగరంబుఁ జేపట్టి యారూపవతి యాపాలకడలి
కుమారిక చేరికకు మరలె నంత హేమాబ్జనాయికాకాంత
తనడెందంబుఁజిందరవందరసేయు నిందుకందర్పుల దర్పంబు
సైరింపఁజాలక వారిని నిందించె నట యెటువలెను.

ఏలపదం - కురంజి - అట.

ఎంచి చూడఁ దమ్ములకు నెపుడు పగదాయవు నీవు
మంచివాఁడవా చెల్లెండ్లకు వెన్నెలరాజ !
ఇంచుకయు నీవగ మానవు. 1

విరులు నీయమ్ము లని యుంటి వింతగా నామీఁద నేఁడు
మెఱుఁగు వాఁడితూపు లేసేవు ఓ వలరాజ !
తరుణుల నిట్లలయింతురా ? 2

వ. ఈలాగున బాలామణి రజనీనాయకుని రాజీవసాయకుని నిందించి కాంతునిచెంతకు బంచిన యింతిరాక కెదురు జూచి వేసరి యొక కేసరిమధ్యతో నే మనుచున్నది.

దరువు - ఆహరి - అట.

చెలువమన్నారుసామిచెంతకు నింతకు
చెలి చేరునో ! లేక చేరఁగాలేదో ! 1

చేరిన నామాట చిత్తగించి వినునో ?
ఆఱడి బెట్టునో ! యందఱిలోన. 2

ఏతీరు నాకో ర్కెలీడేరు నమ్మ !
నాతిరో ! విభుఁ డెట్లా నను జేరు నమ్మ ! 3

వ. అని చింతింపుచున్న యయ్యింతిచెంతకు గోపాలునిదండ నుండి రూపవతీసతి వచ్చె నట యెటువలెను.

(దరువు) - గుమ్మకాంబోది - అట.

మురవైరి యొసంగిన ముద్దుటుంగరముఁ బూని
యరుణాబ్జదేవిచెంత కప్పు డాచెలి వచ్చె.

వ. ఇవ్విధంబున వచ్చిన యాభామ హేమాబ్జనాయికతో నే మనుచున్నది.

పదం - కల్యాణి - ఆది.

చాల లాలించనే రాజగో
పాలుఁడు నీమనవు లాలించెనే. 1

ప్రేమ నీ మేలెంచెనే నీ కిమ్మని
భామ ! యీముద్రికఁ బాలించెనే. 2

కలఁక లన్నియుఁ దీరెనే యీపొద్దు
నెలఁత ! నీ కోరిక నెఱవేఱెనే. 3

వ. అని పొసంగఁ బలికి యయ్యంగన యొసంగిన ముద్దుటుంగ రంబుఁ జేకొని యాచెంగమ్మ బత్తితో హత్తి తనకన్నుల నొత్తి చెలిఁ జూచి తలయూఁచి మేలుమే లని మేలెంచి లాలించి యే మనుచున్నది.

పదం - కాంబోది - ఆది.

హృదయంబు చల్ల నాయనే యీవేళఁ దనకు
సుదతి ! మాటవాసెల్ల నీసొమ్మాయెఁ గదవే. 1

చపలలోచన ! నీవు సవరించినట్టి
యుపకారమునకుఁ బ్రత్యుపకార మేమి ? 2

సకుల నెందఱి నైన సంతరించితి గా
నొకరైన నీవలె నోదవిరే యిపుడు. 3

నీవంటి నెనరైన నెచ్చెలి గలుగ
నీవేళ నాకోర్కు లీడేరె నమ్మ ! 4

వ. ఈరీతి యానారీతిలకంబు నాదరించి యాచెంగమలాకాంత వంతమాని యెంతయు సంతసించి నీరాకరశాయి రాకఁ గోరుచు నుండె ననంతరకథాసంవిధానం బెటువలెను.

వ. ఆవేళ గోపాలదేవుఁ డారూపవతీసతి బలికిన పలుకులు తన తలంపులో నూహింపుచు మోహంబు నెఱియ దేహంబునఁ బులకలమొలకలు మెఱయ నల కెందమ్మి జవరాలియంద చందంబులు తనచిత్తంబున గీలించి నెత్తంబును జాలించి తిలకంబుఁ దీర్పక కలపంబుఁగూర్పక వేదండగమనలఁ జేరక పూదండలు గోరక చిలుకల పలుకులఁ గులుకుచు చెలులు బిలువకే పలుకుచు పలికి యంతలో బెళుకుచు తాళరాని విరాలిజాలి పోలి యాముస్నిటిమస్నిని కన్నియ తన కన్నులఁ గట్టినయట్లు దోఁచిన యాచెలిఁ జూచి యే మను చున్నాఁడు.

పదం – ఘంటారవం – అట.

ఏ మనేవే ముద్దుగుమ్మ ! యేలుకోవె బంగారుబొమ్మ ! 1

నెలఁతరో ! నీపాదమాన నీసరసకు రాకమాన
చలముసేయ నాయమానా చాలనమ్మిన బంటగాన. 2

దక్కితి సొక్కితి చాల దయఁ జూడవే నన్ను బాల !
మక్కువతోఁ బిలువ వేల ? మరునిబారికిఁ దాళఁజాల. 3

మగువ ! నాపై దయలేదా బిగువుకౌఁగిటఁ జేర్పరాదా !
పగలు రేలును నాతో వాదా నాపలుకు నీచెవి
కింపుగాదా. 4

వ. అని యాసరోజేక్షణతో దక్షిణద్వారకాధ్యక్షుండు మఱియు నే మనుచున్నాఁడు.

పదం - కాంభోది - ఆది.

ఇంత యేఁతురా నన్ను వింత సేతురా
యింతిరో ! మొక్కెను న న్నేలుకోవే. 1

కన్నెరో ! నీముద్దుమోముఁ గనుఁగొన్న యప్పటనుండి
క్రొన్నన వాఁడాయనే యీపండువెన్నెల వేఁడాయనే
నిన్నెడబాసియున్న నిమిష మేఁడాయనే. 2

ముదితరో ! నీదు చక్కెరమోవి విందుసేయకున్న
నిదుర రాదే నాకంటికి నేఁ దాళఁజాల
మదనుని చెఱకువింటికి వానిదండిబా
రెదిరేఁచె నే నోర్వ నొంటికి. 3

వ. అని మఱియు నే మనుచున్నాఁడు.

—: గోపాలస్వామి చదివే పద్యం :—

సీ. చెలుల నెవ్వారి నైనఁ జేరి నేఁ బిల్చినా
నీపేరె వచ్చునే నీరాజాక్షి !
ఇంపుమీరఁగ నే నేదిక్కుఁ జూచిన
నీయందమే తోఁచు నీలవేణి !
ఘల్లను నాసానకత్తి పల్కులె నీదు
చేతిగాజులసద్దు రీతిఁ దోఁచు
గజనిమ్మపండ్లను గనుఁగొన్న యపుడె నీ
వలిగుబ్బపాలిండ్లె తలఁచుకొందు

గీ. నింక ని న్నెడబాసి నే నెట్టు లోర్తుఁ
బచ్చవింటివజీరుని బారిఁ జిక్కి
హత్తి దయమీర నీమోది బత్తిచేత
మరులుకొంటిని న న్నేలు మచ్చెకంటి !

వ. ఇత్తెఱంగున నవ్విహంగపుంగవతురంగుం డంతరంగంబునఁ గంతుసంతాపంబున నెంతయుఁ జింతింపుచుఁ జెంగమలాసతీ సంగతిఁ గోరుచున్న తత్సమయంబున నుత్సహించి యా చెలువమన్నని గొలువఁ దలంచి నేమంబుమీఱ నామతీ ర్థంబై సంచపురేకుల నిగనిగల తెగల నించు తనమేను ద్వాదశోర్ధ్వపుండ్రంబులు మీటారింప తననిష్ఠామహిమ వసిష్ఠాదుల మటారింప నంతరంగంబున నామోదరసతరం గంబులు దుఱంగలింప వింతచిఱునవ్వు మోవిపైఁ జెంగ లింప నాశ్చర్యచర్య దులకింప సంగంబు పులకింప నానంద బాష్పాంబుధారలు నెఱయ నపారభక్తిపారవశ్యంబు మెఱయ మన్నారుదేవుని సన్నిధానంబునకు మన్నారు దాసుండు వచ్చె నట యెటువలెను.

(దరువు) - కేదారగౌళ - అట.

శృంగారవతులు తనచెంగట చేరి కొలువ
సంగీతమేళంబు సరస రాణింప
రంగుమీఱఁగా విజయరాఘవేంద్రుఁ డావేళ
బంగారుమన్నారుపజ్జకు వచ్చె.

వ. ఇవ్విధంబున మన్నారుసన్నిధి చేర వచ్చి పెన్నిధిఁగన్న చందంబున నానందంబుఁ జెంది పునః పునః ప్రణామంబులు గావింపుచు మనఃపద్మంబునకు రావింపుచు తన్మూర్తి భావింపుచు తనలోనె సంభావింపుచు తదీయదివ్యనామంబు లుచ్చరింపుచు తరుణులకు హెచ్చరింపుచు కైకానుక లొసంగుచు కడుభక్తి నెసంగుచు పూజలు సేయుచు పొంగుచు డాయుచు రంజిలి కృతాంజలియై విజయరాఘ వేంద్రుఁ డావిజయసహాయుని వినుతించె నట యెటువలెను.

—: విజయరాఘవనాయకుఁడు చదివే ద్విపద :—

జయ దేవకీపుత్ర ! జయపద్మనేత్ర !
జయ మోహనాకార ! జయ యదువీర !
జయ దైత్యసంహార ! జయకీర్తిహార !
జయ రాజగోపాల ! జయ దయాశీల !
చేరి మీపాదముల్ సేవింపఁగంటిఁ
గోరిక లీడేరెఁ గుతుకంబు మీరెఁ
దపము ఫలించె నే ధన్యుండ నైతి
నిపుడు వేడ్కఁ జెలంగె హృదయ ముప్పొంగె
నీకటాక్షంబున నిరుపమశ్రీలు
చేకొని యభివృద్ధిఁ జెందఁగఁ గంటిఁ
బాయని బహుపుత్రపౌత్రాభివృద్ధి
నాయురారోగ్యభాగ్యము లందఁ గంటి
వారిజభవభవవాసవాదులును
సారె కెంతం తని చర్చింపలేని
మహిమచేఁ జెన్నొందు మన్నారు నీవె
సహజసత్కరుణచే సాక్షాత్కరించి
నావీట నెలకొని నన్ను నీరీతి
నేవేళ బోషింప నింపొందఁ గంటి
నీముద్దుబట్టినై నెగడిన నన్ను
ప్రేమతోఁ జేపట్టి వెలయింప వయ్య !

వ. అని మస్తకన్యస్తహస్తుండై ప్రస్తుతించి తనశుభసూక్తుల కభిముఖుండు గానేరక యూరక వేటొకపరాకున విన్ననై యున్న చెంగలంకారునిదండ జేరి దండంబు లర్పించి ప్రార్థించి వెండియు చోళభూమండలాఖండలుం డే మని విన్నవింపుచున్నాఁడు.

పదం - భైరవి - అట.

స్వామి ! నేఁడీలాగున్న చంద మిదేమి ?
వేమారు వేఁడెదను వివరింపవయ్యా ! 1

సమయము దెలియక యెప్పుడు సముఖానకు నే వచ్చిన
క్రమముతో విజయరాఘవ ! రమ్మటంచు
మమతమీర లాలించి మనవు లాలించి ప్రేమ
మమర చనవు బాలించి యాదరింతురుగా ! 2

పొలఁతులపైఁ బొలయల్కఁ బూనియున్నయందమో !
ఎలమి నారదగానముచే నింపొందు సమయంబో ?
అల సనకాదిమౌనుల యభినుతు లాలించేరో !
అలరఁగ మీచిత్త మేమి ? ఆనతియ్యరాదా. 3

వ. అని పలుకు తనముద్దులపట్టి సుద్దులకు నుప్పొంగి నిజప్రభావంబు భావంబునఁ దలంపుచు సంపంగిమన్నండు దయాసంపన్నుండు గాన ప్రసన్నుండై వత్స ! రారమ్మని వాత్సల్యంభరబున నరంబునఁ గరంబు పేర్కొని పిలిచి శిరంబు మూర్కొని వీఁపు మూఁపు హస్తంబున మస్తరింపుచు వింతపలుకుల కుస్తరింపుచు నఖిలచింతలు నిస్తరింపుచు నామోదంబు విస్తరింపుచు నతనితో నే మనుచున్నాఁడు.

—: స్వామి చదివే ద్విపద :—

మన్నారుదాస ! ఓమంజువిలాస !
చిన్నారిపట్టివై సేవ సేయుచును
బహువిధగోపురప్రాకారములును
మహనీయమణిమయమంటపంబులును

కనకరథములు శృంగారవనములు
ఘనవిభూషణములు గజతురంగములు
మాకు సమర్పించి మాచేఁ గృతు ల
నేకముల్ వెలయించి నిత్యోత్సవములు
బహువైభవంబులు ప్రకటించు నిదు
సహజసద్భక్తికి సంతసించితిమి
తనయుండు మంత్రియు దళకర్త నీవె
అనురక్తుఁడును భక్తుఁ డాప్తుండు నీవె
పరమబంధుఁడును మాప్రాణంబు నీవె
అరయంగ హితుఁడును నన్నిట నీవె.

వ. అని మందలించి కెందలిరుమోవిపై మందహాసంబు చిందులుఁ ద్రొక్క చెందిన సిగ్గుతోఁ బ్రియనందనునిం జూచి యలమందచెలుల డెందంబులుఁ గరంచు సౌందర్యశాలి మఱియు నే మనుచున్నాఁడు.

పదం - సావేరి - ఝంపతాళం.

వినవోయి నాపలుకు విజయరాఘవవత్స !
తనకు నీకన్నను మిగుల తగువారెవ్వరు ? 1

కలనైన నీకు దాఁచు కార్య మేమున్నది ?
తెలిపెద వినుము నా తెఱఁగెల్ల నిపుడు 2

మున్నీటిరాజుకన్నియను మొన్న కనుఁగొన్నది మొదలు
కన్నులవింటివాఁడు నాపై కలహింపుచున్నాఁడు. 3

రయమున నీపొద్దు కడలిరాజుతో మాటలాడి
ప్రియముగా మాకు నీపెండ్లి యొనగూర్పుము. 4

మక్కువమీఱఁగ నిపుడె మగువను నను గూర్పుము
నిక్కముగా నీకార్యము నీవల్లనే యమరు.

వ. అనిన విని సంజాతమహోత్సాహుండై కంజాతనేత్రు నితోఁ దంజాపురీంద్రుం డే మనుచున్నాఁడు.

—: విజ[1]యరాఘవనాయకుఁడు చదివే ద్విపద :—

దేవాధిదేవ ! ఓ దేవకీతనయ !
దేవర యిప్పు డానతిచ్చిన యట్ల
నడచెద నింతకన్నను భాగ్యమేమి ?
అడియనితో నింత యాన తీవలెనె
ఓ నయ్య ప్రద్యుమ్నసాంబులతోడి
వానిగా నన్ను దేవర గటాక్షించు
గరిమచే నీకార్యఘటనం బొనర్చి
యిరువురఁ గూర్చి యభీష్టముల్ గాంతు
నింతమాత్రమున కింతేల చింతింప ?
కొంతసేపు వినోదగోష్ఠిమై చెలఁగి
యింపుగా దేవర యిందుండి రేని
సొంపుతో నీపొద్దె శుభవార్తఁ దెత్తు

వ. అని పలికి యాకంతుజనకుని చెంతనుండి యతని యనుమతిఁ గాంచి యానగరాజధీరుండు తననగరుఁ బ్రవేశించి చెలువలు కైసేయఁ గొలువుశింగారం బవధరించె నట యెటువలెను.

—: నాయకుని కొలువుశింగారం ద్విపద :—

విజయరాఘవమహీవిభుచిత్త మెఱిఁగి
గజరాజగమన యొక్కతె చెంతఁ జేరి

1. నాయండు.

తిరముగాఁ గస్తూరితిలకంబు దిద్ది
విరిసరుల్ సిగనిండ వింతగాఁ జుట్టి
ఘోలఁతి వే టొక్క-తె బురుసారుమాలు
చెలువుగాఁ గట్టె నాచెలువరాయనికి
నతివ వే ఱొక్క-తె యారాజు కపుడు
రతనాల హెచ్చుతురాయిఁ గీలించె
చవుల హెచ్చగు పెద్దచౌకట్లు నతని
చెవులను హత్తించె చెలువ యొకర్తు
మురువులు హవణించె మురువుగా నొకతె
మెఱయించె నొక్క-భామిని కంటసరులు
సుళువు పట్టుహిజారు సొగసుగాఁ బూన్చి
యలరు ముత్యపుజంటి యరచట్టఁ దొడిగి
వలుఁదని రాజదుప్పటిఁ గటిఁ గట్టి
మొలకకెంపులవంకి మొలఁ జెక్క- నొకతె
చిలుకలతాళీలు చేసరంబులును
తళుకుటుత్తరిగెలు తగు బావాలుపురులు
విడికెంపురవల హంవీరతాయితులు
కడు మించు నక్షత్రకంఠమాలికయు
మొదలైన సొమ్ములామోహనాంగునికి
ముదితలు కైసేసి ముద మంది రపుడు.

వ. ఈచెలువునఁ జెలువలు కైసేయ హొరాయిలుమీరి తన నగరు బయలుదేరి పారులు దీవింప పౌరులు సంభావింపఁ దురంగంబు నెక్కి- చతురంగబలంబులు గొలువ నిరర్గళ వేగంబున మార్గంబు నిర్గమించి గజరాజవరదుని పంపున విజయరాఘవేంద్రుఁ డాపాలసంద్రంపువజీరుని దివాణంబుఁ జేర వచ్చె నట యెటువలెను.

దరువు - కల్యాణి - ఆది.

వెలలేని తేజి నెక్కి విజయరాఘవేంద్రుండు
కలశాబ్ధిరాజునగరికి కదలి వచ్చె నపుడు.

వ. ఇవ్విధంబున వచ్చిన యచ్యుతాధిపపౌత్రుని నదీకళత్రుండు హయంబు నెక్కి రయంబున నెదురుకొనె నట యెటు వలెను.

పదం - పున్నాగవరాళి - ఆది.

సరగున విజయరాఘవచంద్రుని రాక కుప్పొంగి
శరధిరా జెదురుగా వచ్చె పరిజనుల్ గొలువ

వ. ఇవ్విధంబున నవ్వనధిరా జెదురుకొని ముదముతో హయంబు రయంబున డిగ్గి యాచెంగటఁ దురంగంబును డిగ్గి యొయ్యారంబుమీర వచ్చు నయ్యచ్యుతవిజయరాఘవభూమండలాఖండలుని దండఁ జేరి కైదండ యొసఁగి వేడ్కతో నతని దోడ్కొని వచ్చె నట యెటువలెను.

దరువు.

ఘనతమీరఁ గడలిరాజు కైదండ యొసఁగి
తనదు నగరికి మన్నారుదాసుఁ దోడి దెచ్చె

వ. ఇవ్విధంబునఁ దోడ్కొని వచ్చి యగరుధూపవాసనలఁ బొగరుమీరు తననగరుఁ బ్రవేశించి చారుగారుత్మతచ్ఛాయానికాయదంతురంబు లగు కొన్ని కక్ష్యాంతరంబులఁ గడచి నడచి యందు వివిధకీరశారికాపుంజంబుల రంజిల్లు మంజుతరకనకపంజరమ్ములు, వెలుపు గాచరాచలుపల వెలుపల పొలుపలర దీరిన మదకుంజరమ్ములు, రంగారు షడాళు

పన్నె బంగారుకంబంబులు, రత్నమయనూత్న సౌధవీధికా నికురంబంబులు, మగరాలనిగరాల నిగనిగలతెగలఁ జాల మెలఁగు జాలమార్గంబులు, మానికంపు చెక్కడంపు పనులఁ జొక్కటంబులై మించు కాంచనపాంచాలికావర్గంబులు, గొప్పనుప్పాణిముత్యాలసరాల చందువాల బరఁగు మెఱుఁగు సరిగజంటి నునుకుట్టు పనుల గనుపట్టు నునుపట్టు దట్టంపు మేలుకట్టుల రువారంబులు, కలుకసిబ్బపుగబ్బి గుబ్బెతల యబ్బురంపు నిబ్బరంపు నెన్నడల తడబడు నడుగుకెందమ్ముల నందమ్ములగు కుందనంపు టందియల ఝుళంఝుళధ్వనుల మరిగి యంచల తిరుగు రాయంచల సంచారంబులు, వెడఁదనిడుద యంకణంబుల పొంకంబులు, విశాలచంద్రశాలాకనత్కనకపర్యంకంబులు, సాంద్రతర చంద్రకాంతకాంతవేదికాంతరనిరంతరరాజద్రాజోపచార నిస్తులసమస్తవస్తుజాతంబులు, శాతకుంభకుంభరంభాస్తంభరంగవల్లికామతల్లికారంగదుత్తుంగశృంగాటకవ్రాతంబులు గలిగి చెలఁగి చెలువుమీఱు కొలువుకూటంబుఁజేరి యందుఁ జెన్నొందు భద్రపీఠంబుపై నవ్విజయరాఘవ పట్టభద్రుని నుంచి యుపచరించి గారవించి యే మను చున్నాఁడు.

పాదం - సావేరి - ఆది

సుదినమాయె నేఁడు మిమ్ముఁ జూడఁగల్గి నపుడే
మదనవిలాస ! చక్కని మన్నారుదాస ! 1

నిరుపమకీర్తులు గాంచి నిత్యాన్నదానముచే
ధరణి వెలసెద వనుచుఁ దాను విన్నాఁడ. 2

తలచుగాను బదియాఱు దానముల్ గావించు
పరమపుణ్యుండ వెంతయు బ్రహ్మణ్యుండ వీవు 3

మచ్చికమీర మీ రిటకు వచ్చుకార్య మేమి ?
అచ్యుతరఘునాథతనయ ! ఆనతీవయ్య. 4

వ. అనిన విని యాపట్టభద్రుండు సముద్రునితో నే మను చున్నాఁడు.

పదం - తోడి - ఆది.

మున్నీటిరాజ ! వినుము మన్నారుసామికి మీ
కన్నియ యగు చెంగమ్మను గ్రక్కునఁ బెండ్లిసేయు 1

కులశీలసౌందర్యగుణాఢ్యమై భవము లెన్నఁ
జెలువమన్నారుసామికిఁ జెంగమ్మకే తగును 2

ప్రేమతో నిరువురికిఁ బెండ్లిం గావింపు
తామసము సేయవలదు యీముహూర్తముననే. 3

వ. అనిన విని యాగుణరత్నాకరునితో రత్నాకరుం డే మనుచున్నాఁడు.

—: సముద్రుని ద్విపద :—

విజయరాఘవధీర ! విజయావతార !
విజితారివీర ! కోవిదజనాధార !
విన్నప మొక్కటి వినఁగద వయ్య !
మన్నారుదేవుండు మహితానుభావుఁ
డెక్కువౌ కీర్తుల నింపొందువాఁడు
చక్కనివారిలోఁ జక్కనివాఁడు.

అతులితగుణముల హరువొందు మేటి
యతనికి మాతనయ నొసంగి వేడ్క
లందుటకన్న భాగ్యము వేఱె కలదె !
ముందుగాఁ దగు విష్ణుమూర్తులఁ బిల్వ
నంపించినాము స్వయంవరంబునకు
సంపంగిమన్నారుస్వామియు నిటకు
వచ్చినఁ జెంగమ్మ వరియించు నాదు
ముచ్చటయును జెల్లు ముద్దుబట్టియును
నెంతయు ముద మందు నీయర్థమునకుఁ
జింతింపఁ బనిలేదు చేకూడు రేపె
అన్నిటా ధన్యుఁడ వఖిలమాన్యుఁడవు
వన్నె వాసియుఁ గల్గి వర్ధిల్లు దొరవు
నీయంతవాఁడు బూనిన యట్టికార్య
మోయయ్య ! యెటులైన నొనగూడు టరుదె !

వ. అని పలికి యాకలశాబ్ధిరాజు నేర్పారఁ గర్పూరతాంబూల కనకాంబరాభరణంబుల బహుమతులు గావించి గారవించిన నుప్పొంగి యప్పు డవ్విజయరాఘవపట్టభద్రుం డా సుభద్రాసోదరుని చెంతకు మరలి తరలి వచ్చె నట యెటు వలెను.

దరువు – కన్నడ – ఆది.

సన్నీటిమన్నీనితోన ముదమున మాటలాడీ
నున్నారుదాసుండు వచ్చె మన్నారుచెంగటికి. 1

వ. ఇవ్విధంబున వచ్చిన యచ్చుతవిజయరాఘవభూపాలుఁ డా గోపాలదేవునికి మొక్కి యేమని విన్నవింపుచున్నాఁడు.

పదం - ధన్యాసి - ఆది.

కోరిక లెల్ల ఫలియించె గోపాల దేవ !
ఔకార ! మీసామ్మోయె నరుణాబ్జవల్లి 1
ఆవసధిరాజువద్ది యాప్తులగు మంత్రులు
ఈవేళనే మిమ్ము బిలువ నిటు వచ్చి రయ్య ! 2
ఉల్లమున గల్గు చింత లెల్లఁ దొలఁగింపుము
కల్ల గాదు నేఁడే మీకుఁ గల్యాణ మగును. 3

వ. అనిన విని యెంతయు సంతసించి యారాజమన్నఁ డా రాజచంద్రునితో నే మనుచున్నాఁడు.

—: రాజగోపాలస్వామి చదివే పద్యం :—

క. రా రమ్ము విజయరాఘువ !
ధారుణి నీవంటి ముద్దుతనయుఁడు గలుగ
సారెకు మామదిలోఁ గల
కోరిక లానగూడు టరుదె గుణరత్ననిధీ !

వ. అని భుజగశాయి విజయరాఘవభూపాలుని మే లెంచి లాలింపుచున్న యాసమయంబున నాసంద్రంపుమన్నీఁడు తన చిన్నికన్నియ యగు కనకాబ్జదేవి యున్న విన్నదనంబు సఖీపరంపరలవలన విన్నవాఁడై యాతరి తనకూతురికి సన్నేహంబుగా వివాహంబు సేయ నూహించి స్వయంవర మహోత్సవంబుఁ జాటించి వార్త కెక్కిన భగవన్మూర్తుల వారి వారి వేఱువేఱఁ బిలువ నియోగుల నియోగించెఁ గనుక నతనిపంపున సొంపున నీరదవర్ణునికడకు నారద ఘూని వచ్చెనట్ల యెట్టుష్టలెను.

దరువు - కాపి - ఆది.

శ్రీరాజగోపాలుని చెంగటి కావేళ
నారదమౌనీంద్రుండు చేరఁగా వచ్చె.

వ. ఈరీతిఁ జేరిన యాకయ్యాంపు నెయ్యంపు సువారంపురువారంపు[1]టారి వేరంపుజాడదారి పొంకముగాఁ బంకజాక్షునిపై సంకీర్తనఁ బాడి నటించె నట యెటువలెను.

పదం - భైరవి - అట.

జయము జయము నీకు సంపంగిమన్న ! నన్ను
దయఁ జూడు దక్షిణద్వారకాధీశ ! 1

మదిలోన నేను నీ పదములే నమ్మితి
మదనజనక ! నన్ను మన్నింప వయ్య.! 2

యదువంశచంద్ర ! నిన్ను ముదమునఁ బొడగంటి
హృదయము రంజిల్లె నిపుడె ధన్యుండ నైతి. 3

వ. ఇవ్విధంబున వచ్చిన వియచ్చరమునీంద్రుని నచ్యుతుం డెదురుకొని యర్ఘ్యపాద్యాదిసత్కారంబుల గారవించి కాంచనపీఠంబున నుంచి యుపచరించి యేమనుచున్నాఁడు.

స్వామి మాట :-రావయ్యా ! మౌనివర్య ! మీరు యిటు
విచ్చేసిన కార్యమేమి ? తెలుపవయ్యా !

నారదుని మాట :- ఓస్వామి ! గోపాలదేవ ! ఆపాల
మున్నిటిమన్నీఁడు తనకన్నియ
యగు చెంగమ్మస్వయంవరమునకు
దిక్కులనున్న విష్ణుమూర్తుల నందఱి

1. టారివారంపు

నిన్ని పిలువ నంపినవాఁడై దేవరను
దోడితెమ్మని నన్ను నీడకుఁ బంచి
తమవగ నియోగిచేఁ బసుపుపత్రిక నం
పించినాఁడు. విన నవధరింపవయ్య!

వ. అనిన విని మన్నారుదేవుండు కనుసన్న సేయ నొకరాయ సంపుఁగొమ్మ యాకమ్మ జేకొని సమ్ముఖమ్మున నిలిచి చదివె నట యెటువలెను.

—: రాయసంపుచెలి చదివే పద్యం - కమ్మవక్కణ :—

సీ. శ్రీమన్మహాగుణస్తోమసంపన్నుఁడై
భాసిల్లు రాజగోపాలశౌరి
పాదంబులకు మ్రొక్కి పాలకడలిరాజు
వేడ్క సేయంగల విన్నపంబు
సౌమ్యసంవత్సర చైత్రశుద్ధాష్టమి
మాపట్టి యగు చెంగమకు స్వయంవ
రోత్సవం బొనరింప నుద్యుక్తులైనాము
తామిటు విచ్చేసి యీమహోత్స

గీ. వంబు నెఱవేర్పఁగావలె స్వామిసమ్ము
ఖానకును నారదునివెంట మానియోగి
నంచితిమి వారిపల్కు లాలించి మీరు
వేగ నిటు సాగి వచ్చేది విన్నపంబు.

వ. అని యిటువలె కన్నియ జదివిన మున్నీటిరాజు విన్న వత్రంబువక్కణ విన నవధరించి సెమ్మది సమ్మదంబుఁ జెంది యమ్మునివరునితో నమ్మురవైరి యే మనుచున్నాఁడు.

గోపాలస్వామి మాట :-ఓమునిపుంగవ ! ఆలాగే యిదిగో
కదలివచ్చేము ముందుగా మా
రాక నీరాకరేంద్రున కెఱిఁగింప
వయ్యా !

వ. అని సబహుమానంబుగా నతని బంచి యుంచిత వైభవం
బుతోఁ గాంచనవనస్వామి హేమాబ్జనాయికాస్వయంవరో
త్సవంబునకు నుత్సహించి చెలువుబొంగారఁ గొలువుసింగా
రంబుఁ బూనె నట యెటువలెను.

—: స్వామి కొలువుసింగారం ద్విపద :—

ఆరాజగోపాలుఁ డప్పు డుత్సహించి
తీరుగాఁ గస్తూరితిలకంబు దిద్ది
జగజంపుసంపంగిసరు లరజారు
శిగఁ జుట్టి యాపైని జీనికడాని
సరిగె ముత్తెపుజంటి సవరణ యొంటి
పార బురుసారుమాల్ పొలుపొందఁ గట్టి
బలుడంబుచలడంబుపై రహిమీరు
సుళువు పట్టుహిజారు సొగసుగాఁ దొడిగి
సింగంపు పనిత్రాఁత జిలుగుకంగోరు
బంగారుసరిగెదుప్పటి వలెవాటు
సీటుమీరఁగ వైచి నిగనిగల్ దేరు
తేటసుప్పాణిము[1] త్తెముల చౌకట్లు
ధరియించి యుల శ్యమంతకకౌస్తుభముల
తరమైన చిలుకలతాళీలుఁ బూని
నెమ్మైన జవ్వాది నెత్తావు లీన
ఘుమ్మను జాతికుంకుమగంద మలఁది

1. ముత్యాల

మురువైన తాయితుల్ ముదుటుంగరములు
కరకంకణంబులు గండపెండెంబు
సరపణిలును కంటసరులు చేసరులు
మురువులు హారముల్ మొదలుగాఁ గలుగు
సముధికరత్నభూషణములు దాల్చి
కమనీయవైభవగరిమతో నిల్లు
కొలువుసింగారమై కోటికందర్ప
లలితసౌందర్యవిలాసుఁడై మెఱసె.

వ. ఈదారి హజాయిలుమీరి మురవైరి భేరీప్రముఖభూరితూ ర్యరవంబులు దశదిశల ఘోరుకొనంగఁ జెంగట సంగీత మేళంబు జెలంగ వందిబృందంబు లందంబు దైవారఁ గైవారంబులు సేయ రువారంబుమీర వారకాంతలు తనచెంత వింతగా పంతువిధంబు నటియింప నింతంతట బారుదారులు బరాబరులు గావింపఁ బారులు దీవింపఁ జారులు సంభావింప రాజసంబున రతిరాజసమానుండై మున్నిటిమేటిపీటికి వెడలి వచ్చె నట యెటువలెను.

దరువు.

వెడవిల్తుఁ గన్నయ్య విభవంబు మీరఁగాఁ
గడలివాజుపీటికిఁ గడువేడ్క వచ్చె

వ. ఇత్తెఱంగున రంగుమీరి వచ్చుచో నచ్యుతవిజయరాఘవ మహీవిభుండు తనదండఁ జేరి కైదండ యొసంగ నెరరాజ సంబున వచ్చు రాజగోపాలు నప్పు డప్పయోధిరాజు ముదముగదుర నెదురుకొనె నట యెటువలెను.

దరువు - కేదార - అట.

చెలఁగుచు దొరలు గొలువ మన్నరుస్వామి
కెలమితోఁ గడలిరా జెదురుగా వచ్చె.

వ. ఇవ్విధంబున నెదురుకొని యవ్వనధిరాజతని నుచితసత్కారంబుల గారవించి యుపచరించి తపనీయమయంబై తేజంబుమీరు స్వయంవరమంటపరాజంబున నుచితరత్నఖచితపీఠమ్మున నుంచి భావంబు రంజిల్ల నామహానుభావు నితో నే మనుచున్నాఁడు.

పదం - గుమ్మకాంబోది - అటతాళం.

ఏమయ్య గోపాలదేవ ! స్వామి యిటకు విచ్చేయఁగా
నామందిరము పావనం బయ్యె నేఁడు. 1

తపము లెల్ల నెఱవేఱె ధర్మంబు లీడేరె
నిపుడు నాముచ్చట జెల్లె హృదయము రంజిల్లె. 2

భువిలో ధన్యుండ నైతి భువనమాన్యుండ నైతి నే
నవరించు యీవేడుక సఫల మాయె నేఁడు. 3

వ. అని పలుకుసమయంబున నతిధవళదేహుండగు నాదివరాహుండును, రంగత్కృపాతరంగితాంతరంగసనాథుం డగు కస్తూరిరంగనాథుండును, పంకజాప్తసంకాశుం డగు వేంకటేశుండును, సరససద్గుణమణిశ్రేణి యగు శార్ఙ్గపాణియును, పాలితద్విరదరాజు లగు వరదరాజులును, చారుతరవైభవుం డగు వీరరాఘవుండును, నీలమేఘప్రభుండును నగు నీలమేఘప్రభుండును మొదలుగా దిక్కులఁ గీర్తులుగన్న భగవన్మూర్తు లారత్నాకరేంద్రుని రత్నమందిరమ్మునకు వచ్చి రట నొటువలెను.

దరువు - శంకరాభరణం - ఆది.

వెన్నునిమూర్తు లందఱు వింత వింత హాొయిలుతో
మున్నీటిరాజునగరికి ముదమున వచ్చిరి.

వ. ఇవ్విధంబున వచ్చిన యవ్విష్ణుమూర్తుల నవ్వనధిరాజు శుభోదర్కంబుగా నెదుర్కొని సగౌరవంబుగా వారలఁ దోడి తెచ్చి కాంచనపంచాననపీఠంబుల నుంచి యాదరించు నాసమయంబునఁ జెంగమ్మ కొలువుసింగారంబుఁ బూనె నట యెటువలెను.

—: చెంగమ్మవారి కొలువుసింగారం ద్విపద :—

ద్వి. ఆవేళ నయ్యరుణాంబుజవల్లి
సేవలు గావింపఁ జెలు లిరువంక
కురులు దువ్వి మిటారికొప్పమరించి
సరిలేని యరవిరిసరములు జుట్టి
జలజాక్షి యొక్కతె సరస వహించు
నిలువుటద్దములోని నీడఁ గన్గొనుచుఁ
దెలివొందఁ గస్తూరితిలకంబు దిద్ది
కలికి వాల్గన్నులఁ గాటుకఁ దీర్చి
వగమించు సరిగెపావడ ధరియించి
జిగిబురుసాచీరఁ జెలువొందఁ గట్టి
సింగార మమరంగ జిలుగుబంగారు
రంగులకంగుల రవికె ధరించి
పొలుపొందు కపురంపు భుగభుగల్ మించఁ
గులుకుగుబ్బలను గుంకుమగంద మలఁది

ముత్యాలకుతికంటు ముంజేసరాలు
నుత్తరిగెలు మఱి యుదిరిగాజులును
నింద్రాణికడియంబు లింద్రనీలముల
సాంద్రంబు లగు కంటసరి బన్నసరులు
పదకముల్ మగరాల పాపటబొట్టు
ముదురుకెంపుల మించు ముద్దుకంటియును
ముంగర బవిరలు ముత్యాలసరులు
నుంగరాల్ సరిపెణె లొడ్డాణ మమరు
సందులదండలు చంద్రసూర్యలును
నందియల్ మట్టెయ లాదిగాఁ గల్గు
సకలభూషావిశేషంబుల చేతఁ
జికిలి నెమ్మేను సైసేసి యెంతయును
సరిలేని తనరత్నసౌధంబు డిగ్గి
సరుగ స్వయంవరస్థలిఁ జేర వచ్చె.

దరువు - సౌరాష్ట్ర - ఆది.

బంగారుచాయలఁ బరఁగు పల్లకి నెక్కి-
చెంగమ్మ యాసభఁ జేరఁగా వచ్చె.

వ. ఇవ్విధంబున వచ్చి యవ్వధూమణి పల్లకి డిగ్గి మెల్లనె యల్ల స్వయంవరరంగంబుఁ జేరంగ నల చెంగమ్మచెంతఁ జేరి రూపవతీ కాంత యావిష్ణుమూర్తుల వేఱువేఱఁ జూపి వారి వారి పేరుపెంపు లాసంపదజవరాలితోఁ దెలుపునప్పు డప్పడఁతి ప్రత్యుత్తరం బిచ్చు నాదారికి వారికిఁ బరస్పర వచనరచనలు నడచె నట యెటువలెను.

పదం - సావేరి - ఆది.

రూపవతి :- చెంగటి పారిజాతమై సేవకుల రక్షించు
రంగనిలయుఁడే యితఁడు బంగారుబొమ్మ!

చెంగమ్మ :- పొంగుచు నామదిలోని పూనిక నెఱవేర్పు మని
యంగనరో! యితనికి యంజలి జేసేనే. 1

రూప :- ఆదైత్యవీరుని గెల్చి యవనిఁ దెచ్చి నిల్పిన
యాదివరాహుఁడే యితఁడు యలరుఁబోఁణిరో!

చెంగ :- నాదుప్రాణవల్లభు నను గూర్పు మని వేఁడి
యీ దేవునికి మొక్కేనే యిందువదన! 2

రూప :- శరణన్నవారలఁ గరుణచే వెలయించు
వరదరాజు యితఁడే వనజలోచన!

చెంగ :- తరుణిరో! నావిభునిపైఁ దగిలి నామనసు
మరల నేర్చునా! యిటువంటి మాట లేలనే. 3

రూప :- పొంకముగ భక్తులను బోషింపఁజాలిన
వేంకటరమణుఁడే యితఁడు విరిఁబోఁణిరో!

చెంగ :- పంకజలోచన! నాదు పతినిఁ జూచిన కన్నుల
నింక వేఱొకరిని జూడ నితవు గాదమ్మ! 4

కాపి - ఆది.

రూప :- చక్కని వారిలోఁ జక్కనివాఁ డమ్మ!
జక్కవగుబ్బెతల సొక్కించువాఁడు
చక్కెరవిల్తునిఁ గన్న సంపంగిమన్నఁడే
గ్రక్కున నితని నీవు కనుఁగొన వమ్మ!. 5

చెంగ :- మున్ను జూచినవాఁడే వీఁడు
వీనిపైఁ జాల మరులుకొంటినేగ
మగువ! వీనిపై మనసు హత్తెనే

వ. అని పలికి తనచెంగట మంగళతూర్యరవంబులు చెలంగఁ బొంగుచు జనులు కనుఁగొనంగ వేలుపులు విరులసోనలు గురియింప విబుధతతులు సన్నుతులు నెరయింప నల కల కంఠకంఠి యదుకులకంఠీరవుని యుపకంఠంబుఁ జేరి యుత్కంఠమీఱ నతని కంఠంబునఁ దనకెంగేల నున్న బంగారు విరుల సరంబు హత్తించె నట యెటువలెను.

దరువు - కల్యాణి.

కనకవనాధీశు కంఠంబునందుఁ
గనకమాలికఁ జేర్చెఁ గనకాబ్జవల్లి. 1

వ. అంత హేమాబ్జనాయికాకాంత నిజాంతఃపురంబుఁ బ్రవేసించిన యనంతరంబ రాజగోపాలుండు రాజవీధుల బయలు దేరి హళాయిలుమీరి బంధురం బగు గంధసింధురం బెక్కి నట వచ్చె నట యెటువలెను.

దరువు.

మదగజేంద్రము నెక్కి మన్నారుదేవుండు
ముదమునఁ గడలిరాజుసదనముఁ జేరఁ వచ్చె.

వ. ఆసమయంబునఁ జెంగమ్మ యాసభారంగంబుఁ జేర వచ్చె యెటువలెను.

దరువు.

చెంగట చెలువలు చేరి తను గొలువఁగాఁ
జెంగమ్మ పెండ్లిచవికెఁ జేరఁగా వచ్చె.

వ. అప్పు డుప్పొంగి యప్పయోధిరాజు బంగారుపెండ్లిచవికె లోన హవణైన నవరత్నమయంబు లగు పెండ్లిపీఁటలపై

నారక్తాబ్జనాయికారాజగోపాలకుల నుంచె నట యెటు
వలెను.

దరువు.

చెంగమ్మను జక్కని చెలువమన్నారును
బంగారుపీఁటపై నుంచెఁ బొంగుచుఁ గడలిరాజు. 1

వ. ఆసమయంబున నాసంద్రంపుమన్నీఁడు బిల్వనంప భాసురా
మోదంబుతో భూసురాగ్రణు లగు పురోహితు లాసభఁ
జేర వచ్చి రట యెటువలెను.

దరువు - సౌరాష్ట్ర - ఆది.

పంచాంగములు జేపట్టి పట్టెనామములు బెట్టి
యంచితముగఁ బురోహితు లటు వచ్చి రపుడు.

వ. ఈరీతి వచ్చిన పురోహితు లావాహినీపతిని దీవించి యే
మనుచున్నారు.

—: పురోహితుల మాటలు :—

మంగళాని భవంతు, అఖండితప్రతాపోస్తు,
దీర్ఘాయుష్యమస్తు, ఓమహానుభావ! దేవర
వారు మమ్మింతశీఘ్రముగా నిప్పుడు రప్పించిన
కార్యమేమి? ఆనతీవయ్య!

సముద్రుని మాట :- రారోయి! పురోహితులార! రాజ
గోపాలస్వామికి మాపట్టి యగు
చెంగమ్మను పెండ్లిచేస్తున్నారము,
మీరు ముహూర్తంనిర్ణయించివివా
హామహోత్సవంబారంభించరోయి!

పురోహితులమాట:- స్వామి !అష్టువలెనే నిర్ణయించినారం
"శుభస్య శీఘ్రం" అన్నాఁడు గనక,
"మనోజయంతుమాండవ్యః"అన్నట్టు
ఇదే సుముహూర్తము అలాగే
వివాహోత్సవం బారంభించేమయ్యా!
ఒహోహో! ఏలినవారు సిద్ధసంక
ల్పులు గారా అలాగే సంకల్పం దొర
కుఁదాం రారోయి!

సంకల్పం.

శుభే శోభనే ముహూర్తే ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్వర్తమానే వ్యావహారే చాంద్రమానే సౌమ్యనామసంవత్సరే ఉత్తరాయణే వసంతర్తౌ చైత్రమాసే శుక్లపక్షే అద్య శుభనక్షత్రశుభయోగశుభకరణయుక్తాయాం అస్యాం శుభతిథౌ రక్తాబ్జనాయికారాజగోపాలయోః ఉద్వాహాఖ్యం కర్మ కరిష్యమాణః తదాదౌ శుధ్యర్థం వృధ్యర్థం అభ్యుదయార్థం చ శోభనార్థం నాందీ దేవతాహ్వానం కరిష్యే.

తదేవ లగ్నం సుదినం తదేవ
తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ
లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి.

సుముహూర్తోస్త్వితి భవంతో బ్రువంతు సుముహూర్తమస్తు.

వ. ఇవ్విధంబునఁ బురోహితులు సంకల్పంబు గావించుసమయం
బునఁ బొంక మగు కుంకుమబొట్లు నిటలతటంబుల రాణింపఁ
బసుపురసపునిగ్గులు నెమ్మేన మిటారింపు జాతిశృంగారంబు
బొంగార భాసురోల్లాసంబున భూసురాంగనలు వచ్చి రట
యెటువలెను.

దరువు - సౌరాష్ట్ర - అట.

పగడంపు చొకట్లు బారికుంకుమ బొట్లు
జిగిదేరు పోఁకవన్నె చీరలతీరు
మొగమున పసుపుడాలు ముదుగు రవికెలకీలు
సొగసుమించ ముత్తైదువల్ సొంపున వచ్చిరి.

వ. అప్పు డప్పాటలగంధులు పాటలు బాడుచు వచ్చి రట
యెటువలెను.

లక్ష్మీకల్యాణ - దరువు.

శృంగార మమరఁగాఁ జెలువమన్నారు
చెంగమ్మపెండ్లికిఁ జెలులార! రారె 1
నిచ్చకల్యాణంబు పచ్చతోరణము
హెచ్చైన కడలిరా జింట నేపొద్దు. 2
కన్నులు చల్లఁగాఁ గనుఁగొంద మమ్మ!
మన్నారుసామిని మనచెంగమ్మను. 3

వ. ఈరీతి వచ్చిన పేరఁటాండ్రు లచ్చట ముచ్చటలాడి రట
యెటువలెను.

ముత్తైదువల మాటలు :- రావె ఓకాసలన్నాటి తిమ్మక్క!

మఱొకరి మాట :- ఇదిగో వస్సుందానసే ! పేరూరి రామక్క ! వింటివా, ఒసే జందేల బుచ్చక్క ! అదేందే వోభారతాలసూరక్క ! వస్తివా, ఒసే పుల్ల గూర పేరక్క ! మనసముద్రరాజు నగరను చెంగమ్మవారికి పెండ్లిచేస్తున్నారట, పాటలు బాడిన ముత్తైదువల కల్లా కట్నాలిస్సు న్నారట పుచ్చుకొందాం వచ్చేరొ, ఒసే

మఱొకరు :- అందుకే కాదొ, ఒసే వచ్చింది. ఓశమ్మ ! వింటి వా, ఒసే మావారు యేమేమొ యెపెటో యేందేందో అంచుందారే !

మఱొకరు :- ఏమంచుందారె వోశమ్మ !

మఱొకరు :- మావారు ఇందుకుమాత్రం ముసలివారట యెమ్మైనా నన్ను గడించిపెట్టుమని పోరుకతిచ్చుం దారెవోశమ్మ !

మఱొకరు :- ఓశమ్మా ! అట్లా ననకువే.

“ ద్వి. పురుషుండె దైవంబు పురుషుండె తండ్రి
పురుషుండె నాపాలి పురుషోత్తముండు ”

అన్నాఁడే ఓశమ్మ ! అష్టుగనక నే మావారిని బిడ్డకన్నా విశేషంగా బోషింతునే.

మఱొకరు :- మీావారిని బిడ్డకన్నా విశేషంగాఁ బోషింతు నంటివే, అప్పైతే యిరుగువారూ పొరుగువారూ యేంగావలెనే నీకు ఓశమ్మ ! మీావారినిన్ని మావార్నిన్ని మార్చుకొందామ, ఒసే.

మఱొకరు :- ఓశమ్మ ! నీకు నడు మేల ? బట్టుకొనెనే

మఱొకరు :- ఓశమ్మ ! వింటివా, ఒసే మావారు నిన్నరాత్రి గంఫడేసి బంఢాలు బట్టించిరే,

మరొకరు :-ఔనే చాలు చాలు, పెండ్లిపందిట్లో ఒక
నుడుగు అనరాదషే !

వ. అని ముచ్చటలాడి యచ్చట నప్పు డప్పుడమివేల్పుజవ
రాండ్రు కట్టంబులకై కొట్టంబు దంచుచు నమ్మహోత్స
వాలయాంగణంబున సువాల పాడి రట యెటువలెను.

—: సువ్వాల :—

సువ్వి మోహనాకార ! సువ్వి భక్తమందార !
సువ్వి చెండలంకార ! సువ్వి సువ్వి. 1

బొసవాలు దొరలు జూడ పసపుకేటి దరులజాడ
రాసకేళిఁ దేలుచున్న రాజమన్న ! 2

పాలకడలిరాజపట్టి బాళిమీరఁ జేపట్టి
శ్రీలఁ జాల చెలఁగునట్టి చెలువమన్న ! 3

విజయరాఘవునిపీట వెలయుచున్న - రాజమన్న !
గజరాజగమన నేలు కరుణమీరఁగా. 4

వ. ఆవేళ వసిష్ఠవామదేవనారదకపిలమార్కండేయప్రముఖ
నిఖిలమహర్షులు సహర్షులై వచ్చి రట యెటువలెను.

దరువు - మధ్యమాది - అట.

నెరసిన గడ్డాలు సీర్కావి ధోవతులు
పరగు పట్టుశాలలు పట్టెనామములు
వరరత్నకుండలము లరుదైన జడలును
హారు వంద మునీంద్రు లటు వచ్చి రపుడు.

వ. ఇత్తెఱంగున వచ్చిన మునిపుంగవులు అయ్యంగజగురు
నిపై మంగళాశాసనశ్లోకంబు లనేకంబులు జూర్ణికయుఁ
జదివి రట యెటువలెను.

శ్లో. రుక్మిణీ స్తనకస్తూరీకుంకుమాంకితవక్షసే ।
రాధామోహనరూపాయ రాజగోపాయ మంగళమ్ ॥ 1

మహర్షిమహితం జ్యోతిర్మంగళానాం చ మంగళమ్ ।
త్వామేవ చంపకారామధామన్ స్వామిన్నమోస్తు తే॥ 2

సత్యభామాభిరామాయ సర్వాభీష్టప్రదాయినే ।
యదువంశప్రదీపాయ రాజగోపాయ మంగళమ్ ॥ 3

సురాధిరాజకోటీరరత్ననీరాజితాంఘ్రయే ।
రతీశకోటిరూపాయ రాజగోపాయ మంగళమ్ ॥ 4

మన్నారుదాసభూపాలమణిమందిరవాసినే ।
మహనీయప్రతాపాయ రాజగోపాయ మంగళమ్ ॥ 5

—: చూర్ణిక :—

శ్రీరాజగోపాలదేవ ! దేవతావతంససంస్తూయమానమహనీయనిజప్రభావ! భావసంభవకోటిమోహనలీలామానుషవిగ్రహా ! విగ్రహామహీనిగృహీతదైతేయలోక ! లోకరక్షణవిచక్షణకృపావిలోక ! లోకాలోకవలయితధరణీమండలమండనాయమానకనకాటవీకృతవిహార ! హారనీహారసారఘనసారపటీరసదృశవిశదవిశాలయశోనిరంతరితసకలజగదంతర ! తరణిసహస్రవిభావిభాసమానప్రతాప ! తాపససముదయహృదయనివేశ ! దక్షిణద్వారకాధీశ ! నమస్తే నమస్తేఽస్తు తే నమః

వ. ఆసమయంబున మహోల్లాసంబు రాణింపఁ బాణిగ్రహణమహోత్సవం బవధరించిన రక్తాబ్జనాయికారాజగోపాలకులపై వేలుపుదొరలు విరులవానలు గురియించి రఁట్టొటువలెను.

—: దరువు :—

పూవులవానలుఁ బొంగుచు గురియించి
రావధూవరులపై నమరు లావేళ

వ. అప్పు డప్పురోహితులు నిజస్వాతంత్ర్యంబులకై పరస్పర సంవాదంబు నడపించి రట యెటువలెను.

పురోహితులు రంగయ్య :-ఏమోయి ! బోడసం తిమ్మయ గారు !

తిమయ్మ :- ఏమంచునాఁడవోయి ! అనడ్వాహం రంగయ గారు !

రంగయ మాట :- అదేం దోయి ! బృహస్పతిసంభావన రూకలు నీవు అపలాపించుకొని యెపు వలె యద్వాతద్వాలుచెప్పుచున్నాఁడ వోయి !

తిమ్మయగారి మాట :- భళా ! భళా ! మహా లెస్సాయె, కొంగుముడిరూకలున్న ధార బోఁత రూకలున్న నీవు గ్రహించు కొని యిపువలె యేపాగాధాలు ఆడేది లెస్సవవోయి !

రంగయ మాట :- ఓహోహో ! నన్నే అంచున్నాఁడవు మంచి ప్రాజ్ఞుండవులే

తిమ్మయ మాట :-ఓరి! వజ్రశుంఠ ! నాల్గు తరాలనుండిన్ని నే తగులైనవాఁడ నుండఁగా నిన్నటి నుడుపఁడవు నీకు స్వతంత్రస్వామ్యా లనంగా యేందిరా ?

రంగయ మాట :- ఓహో హో! కాదా మరి నీ గుట్టల్లా బయలు సేతునో!

తిమ్మయ మాట :- సేయరా!

రంగయ మాట :- ఏమోయి! నీకొడుకు యింట్లో సొమ్ముల్లా నెత్తుకొని తొత్తులపాలు జేసి నలుగురిచేతా కాదనిపించుకో లేదా?

తిమ్మయ మాట :- ఓరి! మమ్మా అనేది! చెంపశుద్ధి చేతుమో!

రంగయ మాట :-ఓరి! మిమ్ముదా కాలు బట్టి తీతుమో!

వ. అత్తరి ముత్తైదువలు నీటుపాటల పాటలు బాడి రట యెటువలెను.

—: ధవళం :—

జయ జయ హేమాబ్జవల్లి! జయ జయ కాంతామతల్లి!
జయ జయ రాజగోపాల! జయ జయ రమణీయశీల! 1

జయ జయ కలశాబ్ధికన్య! జయ జయ భువనైకమాన్య!
జయ జయ నందకుమార! జయ జయ మోహనాకార! 2

—: శోభనం :—

శ్రీరాజగోపాలునకు శృంగారవిలోలునకు
చారుముఖోల్లాసునకు చంపకవనవాసునకు 1

నీలాంబుదవేణికిని నిత్యకల్యాణికిని
బాళుకాబొమ్మకును చక్కని చెంగమ్మకును. 2

వ. ఆసమయంబున మహోల్లాసంబున రక్తాబ్జనాయికారాజ గోపాలకులు వేడుకతో జోడుగూడి నటించి రట యెటు వలెను.

—: దరువు :—

చెంగమ్మను జతగూడి చెలువమన్నారుస్వామి
పొంగుచు నటించెఁ బొలఁతులు గొలువ.

వ. ఇవ్విధంబున వివాహమహోత్సవం బవధరించిన రక్తాబ్జ నాయికారాజగోపాలకు లాజలధిరాజుచేఁ బూజ లంది దక్షిణద్వారకాపురంబునకన్న దాపురంబై సకలసంపత్ప రంపరల నిగరం బగు తంజనగరంబుఁ జేర వచ్చి తమ ముద్దు బట్టి యగు విజయరాఘవపట్టభద్రుండు సవరించు వివిధోప చారంబుల నుల్లసిల్లుచు నతనికి దీర్ఘాయురారోగ్యభాగ్యం బులు శాశ్వతైశ్వర్యంబులు బాలింపుచు బంగారుసింగంపు మోము గద్దియపైఁ బేరోలగం బుండఁ దమసమ్ముఖంబున సమ్మదమ్మున మొక్కి నిలిచిన యవ్విజయరాఘవేంద్రుని జేరఁ బిల్చి గారవించి వార లే మనుచున్నారు.

—: గోపాలస్వామి చదివే పద్యం :—

గీ. విజయరాఘవవత్స ! యీపెండ్లి నీవు
సంఘటింపంగ మామది చల్ల నయ్యెఁ
బ్రబలి నీవాయురారోగ్యభాగ్యములను
ధరణి వర్ధిల్లు మాచంద్రతారకముగ.

వ. అని యనురక్తిమీఱ నాదరించు రక్తాబ్జనాయికారాజ గోపాలకులకు వందనంబుఁ గావించి యావిజయరాఘ వేంద్రుం డేమని విన్నవింపుచున్నాఁడు.

—: విజ[1]యరాఘవనాయకుఁడు చదివే పద్యం :—

క. తలిదండ్రులు మీరలు నను
బొలుపుగఁ బ్రియతనయుఁ డనుచుఁ బోషింపంగా
వలయు శుభంబులు జెందుచు
వెలసెద ధరలోన నెపుడు విజయము లెసఁగన్.

వ. అని మండలించు ప్రియనందనుం డగు మన్నారుదాసు లాలింపుచుఁ జాల సమ్మదమ్మున రాజిల్లు నారక్తాబ్జనాయికారాజగోపాలకుల సమ్ముఖమ్మున నీరాజనమ్ములు జేకొని మంగళప్రదంబుగా దివ్యాంగన లిద్దఱు నటించి రట యెటువలెను.

—: దరువు :—

మంగళము సంపంగిమన్నారుదేవునకు
మంగళము మహితానుభావునకును
మంగళము సరిలేని బంగారుబొమ్మకును
మంగళము చక్కని చెంగమ్మకు
జయమంగళం శుభమంగళమ్.

—: భరతవాక్యం :—

ఇవ్విధంబున చెవ్వయాచ్యుతాధిపప్రపౌత్రుండును రఘునాథజననాథపౌత్రుండును విజయరాఘవభూపాలకప్రియపుత్రుండును రాజగోపాలాంబికాగర్భకలశజలధికువలయమిత్రుండును అతులకనకతులాప్రముఖనిఖిలమహాదానదీక్షాధురీణుండును అనేకాగ్రహారప్రతిష్ఠాపనప్రవీణుండును

1. నాయకుండు.

విజయరాఘవాభ్యుదయాది ప్రబంధనిబంధనచాతురీధౌరే యుండును అతులితపితృభక్తిగురుభక్తిభాగధేయుండును మహితానుభావుండును నగు మన్నారు దేవుండు భువనస్తవనీయంబుగా రావణించిన హేమాబ్జనాయికాస్వయంవరం బను నాటకంబునకుఁ గథానాయకు లగు రక్తాబ్జనాయికా రాజగోపాలకులు తమప్రియపుత్రుండై ధాత్రిఁ బాలింపుచుఁ జాల వర్ధిల్లుచున్న విజయరాఘవభూపాలునకు సర్వసర్వంసహాధిపత్యనిత్యాయురారోగ్యభాగ్యంబులు బాలించి రక్షింతురు గాత!

మన్నారు దేవికి మంగళమ్.

హేమాబ్జనాయికాస్వయంవరం సంపూర్ణము.

శ్రీరామచంద్రాయ నమః.